11.2.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 6, విడిప్రతి: రు. 2.00 లు

Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



ఏలూరు సదస్సుకు జనం వేలం వెర్రిగా రావడంతో కాంగ్రెస్ నాయకులు

# బెలూన్ల వలె ఉబ్బి పోతున్నారు!

ఏలూరు సదస్సు గ్రాండ్ సక్సెస్ అయింది. అంత గొప్పగా జరుగుతుందని కాంగ్రెస్ నాయకులు కూడా కలగన లేదు. జనం ఎట్లా వచ్చారో, ఎందుకు వచ్చారో తెలియదు కాని, ఆ వచ్చిన తీరు మాత్రం అందరినీ వెర్రివాళ్లను చేసింది. జనాన్ని బాగా తోలారన్నది వట్టి అపనింద. వెయ్యి లారీలు, బస్సులు పెట్టి తోలారనుకున్నా బండికి యాభై మంది సరాసరిన లెక్క వేస్తే యాభై వేలు దాటకూడదు. కాని వచ్చిన వారి సంఖ్య లక్షల్లో వుంది. సిఆర్ రెడ్డి కాలేజి మైదానం పట్టలేదు; ఎదురుగా వున్న రోడ్డు చాల లేదు; అవతల ప్రక్క రైలు కట్టా సరిపోలేదు. టౌన్‌లో ఎక్కడ చూసినా జనమే. ఏలూరు రోడ్లన్నీ కిటకిట లాడి పోయాయి. గంటల తరబడి ట్రాఫిక్ జాం అయింది. నిర్వాహకులకు వూపిరి సలపలేదు.




ఈ సదస్సును చూసిన ముఖ్యమంత్రి వుప్పొంగి పోయారు. బెలూన్ వలె వుబ్బిపోయారు. ఆయన సంతోషం పట్టనలివి కాకుండా వుంది తెలుగుదేశం పార్టీకి, స్వంత పార్టీలోని విమర్శకులకు గట్టి బుద్ధి చెప్పానని సంబర పడుతున్నా రాయన. ఆ సంతోషంలో బిసిలకు పంచాయితీ రాజ్ సంస్థల్లో 33 శాతం రిజర్వేషన్ కల్పిస్తానని ప్రకటించారు. సబ్సిడీ బియ్యం ధర పెంచనన్నారు. రైతుల కోసం ప్రత్యేక సంస్థ నెలకొల్పుతానని ప్రకటించి, వారం తిరిగే లోగా దాన్ని అమలు చేసేశాడు. ఇదే వూపు రానున్న పదినెలలు పట్టుకొని వస్తే కాంగ్రెస్ తిరిగి గెలవడం ఖాయమని, తాను తిరిగి ముఖ్యమంత్రి నవడం నిజమని నమ్ముతున్నారు. ఆయన అనుచరులూ అదే ప్రకారం ప్రచారం చేస్తున్నారు.

అయితే కాంగ్రెస్ సదస్సు విజయం నిజంగా ప్రజలలో కాంగ్రెస్ పట్ల అభిమానం తరగలేదన దానికి రుజువా? ఈ ప్రశ్నకు సమాధానం స్పష్టంగా లభించడం కష్టం. తోలిన

## సదస్సు పేరుతో మంత్రులు కోట్లాది రూపాయలు దండుకొన్నారు!

జనం కంటే, స్వచ్ఛందంగా వచ్చిన జనం ఎక్కువ కాబట్టి అట్లానే భావించాలి. కాని అదే సమయంలో తెలుగుదేశం సదస్సుకు వచ్చిన జనం సంగతేమిటి? కమ్యూనిస్టుల సభ విజయవంతం కావడానికి కారణమేమిటి? ఇంకా మాట్లాడితే బహుజన సమాజ్ బల ప్రదర్శన తక్కువైనదా? వీటిల్లో ఏ పార్టీని జనం అభిమానిస్తున్నారు? ఆదరించ బోతున్నారు? అర్థమే కావడం లేదు.

కాంగ్రెస్ సదస్సులో అధికార దుర్వినియోగం గురించి మాట్లాడన సవసరం లేదు. హరిరామ జోగయ్య చెప్పినట్లు అలనాటి మహానాడులలో జరిగిన అధికార దుర్వినియోగాలతో పోలిస్తే ఇది చాలా తక్కువ. ఎన్టీఆర్ ఆనాడు పార్కుల్లోని జంతువులను కూడా తెచ్చి కట్టేశారు. ఈ సదస్సు పేరుతో మంత్రులు చేసిన దండకాలు మాత్రం కాంగ్రెస్ పరువు తీశాయి. వాణిజ్య పన్నుల మంత్రి అయితే, చిన్న చిన్న అంగళ్లనుకూడా వదలి పెట్టలేదని వదంతులున్నాయి. రవాణా, ఆరోగ్యం వంటి ఇతర శాఖల మంత్రులూ తమ శక్తి వంచన లేకుండా దండకాలకు చెమటోడ్చి పనిచేశారు. కొన్ని కోట్ల రూపాయలు చేతులు మారాయి. సదస్సు దిగ్విజయం సంబరంలో వున్న ముఖ్యమంత్రి వీటిని సీరియస్‌గా తీసుకోవడం లేదు.

# శివశంకర్ బోర్డు తిప్పితే బిఎస్‌పికి ఊపు వస్తుంది!

ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు కరుణా కటాక్ష వీక్షణాల కోసం చకోర పక్షి వలె ఎదురు చూసి, చూసి విసిగి పోయి, విరక్తి చెంది, బలవంతపు రాజకీయ సన్యాసం అవలంబిస్తున్న మాజీ కేంద్ర మంత్రి శ్రీ పి. శివశంకర్ బహుజన సమాజ్ పార్టీ ఆశ్రయం కోసం రేట్లు వేస్తున్నాడు.

రాజీవ్ గాంధీ మరణంతో శివశంకర్‌కు కాంగ్రెస్‌లో స్థానం పోయింది. పలుకరించే వారు, ఓదార్చుకునే వారు లేకుండా పోయారు. ఆయనెప్పుడూ ప్రజా నాయకుడు కాదు. ప్రజలతో సంబంధం లేదు. ప్రత్యక్ష ఎన్నికలలో పోటీ చేసి గెల్చిన వాడు కాదు. ఎమర్జెన్సీ తర్వాత ఇందిరా గాంధీ కష్ట కాలంలో వున్నప్పుడు ఆమెకు న్యాయ సలహాలందించి, అభిమానం చూరగొని రాజకీయ ప్రవేశం చేసిన నాయకుడాయన. అనత్యమయంలో అందరా వున్నాడన్న ఒకే ఒక సానుభూతితో ఇందిరా, రాజీవ్‌లు ఆయన్ను తమ మంత్రి వర్గాలలో కొనసాగింప జేశారు. పివికి అటువంటి మొగమాటాలేమీ లేవు. జనంతో ప్రమేయం లేని, తనకంటూ ఒక వర్గం లేని నాయకుడితో తనకేమి

## ముఖ్యమంత్రి కావాలని ఉరఉర!

పవన్నట్లుగా ఆయన శివశంకర్‌ను ప్రక్కకు తప్పించేశారు. ఎంత ప్రయత్నం చేసినా దగ్గర చేరనివ్వలేదు. కనీసం తన కుమారుడు సుధీర్ కుమార్‌ను రాష్ట్ర మంత్రి వర్గంలో చేర్పించడానికి శివశంకర్ చేసిన ప్రయత్నాలనూ ఫలించ నివ్వలేదు. ఒకరికి ముగ్గురు ముఖ్యమంత్రులు మారినా ఛాన్సు దొరకక పోవడం వారిని బాధిస్తున్నది; సిటీ రాజకీయాలలో సుధీర్ కుమార్‌కు కొంత పలుకుబడి వుంది. అనుచర వర్గం వుంది. అయినా అది పరిగణనకు రావడం లేదు. ఇంకొక ప్రక్క రాజీవ్ మరణాంతర అల్లర్లలో ఎన్టీఆర్ సినిమా హాళ్ల విధ్వంసం కేసు సుధీర్ కుమార్ రాజకీయ జీవితానికి ఒక మచ్చ వలె పరిణమించింది. న్యాయ విచారణ నివేదికలో ఆయన పై వేలెత్తి చూపారు. శివశంకర్ రాజకీయ గ్రహణానికి ఇదీ ఒక కారణం.

నిరాశ, నిస్పృహ, ఏమీ చేయలేని అసహాయత, భవిష్యత్ పై ఏ మాత్రం ఆశలేని నిర్వీర్యతలతో నీరసించి పోయి వుండిన శివశంకర్‌కు కాన్షీరాం సదస్సు విజయవంతం కావడం ఎడారిలో ఒయాసిస్సు వలె కన్పించింది. దానికి తోడు కాన్షీరాం ఆ సభలో "బిఎస్‌పి గెలిస్తే వెనుకబడిన తరగతుల నాయకుడ్ని ముఖ్యమంత్రిని

కొరవ 7 పేజీలో

# మల్టీ నేషనల్స్‌కు మన భవిష్యత్ ధారాదత్తం!

(గత సంచిక తరువాయి)

మన్మోహన్ సింగ్ సరళీకరణ స్పీడు ఇదే రీతిలో ఇంకొక రెండేళ్లు కొనసాగితే భారతీయ పౌరుడు భారతీయ పరిశ్రమలు ఉత్పత్తి చేసే భారతీయ ఉత్పాదనలు వాడే అవసరం, అవకాశం కోల్పోతాడేమో నన్పిస్తోంది. అన్పించడమే కాదు - అది నిజం కూడా! మన్మోహన్ సింగ్ గారు మనకు పైకి చెప్పేది ఎగుమతుల వృద్ధి; కాని వాస్తవంలో జరుగుతుందేది విదేశీ సంస్థల దిగుమతి! విదేశీ బహుళ జాతి కంపెనీలకు భారతదేశాన్ని దాసోహం చేసేశారాయన. రెండు వందల యాభై ఏళ్లనాడు మనల్ని కొల్లగొట్టడానికి వచ్చిన ఈస్టిండియా కంపెనీకి ఆనాటి రాజులు, సామంతులు, దేశ సరిహద్దు ద్వారాలను బార్లా తెరచిన తీరులో ఈనాటి మల్టీ నేషనల్ కంపెనీలకు మన్మోహన్ సింగ్ గారు దేశ వ్యాపార సామ్రాజ్యాలను ధారాదత్తం పొరాయి వరకు మధ్య తరగతి పౌరుడి నిత్యావసర వస్తువులు వేటిలోనూ భారతీయ ఉత్పాదనలు మిగలకుండా పోతున్నాయి. మన దేశంలో 1991 లో అటువంటి వినిమయ వస్తువుల కొనుగోలుకు పౌరులు 3 లక్షల 95 వేల 330 కోట్లు వెచ్చించారని అంచనా. ఆ ఖర్చు ఏటా 10 శాతం పెరిగితే రెండు వేల సంవత్సరం నాటికి దాదాపు 7 లక్షల కోట్ల రూపాయలు మన నిత్యావసరాలకు ఖర్చు పెట్టబోతున్నాం. ఇంత పెద్ద మార్కెట్‌ను తమ స్వాధీనం చేసుకోవడానికి విదేశీ కంపెనీలు పోటా పోటీగా ముందుకు వస్తున్నాయి. వాటి ధన బలం ముందు మన దృష్టిలో బడా పారిశ్రామిక వేత్తలైన టాటాలు, బిర్లాలు, దాల్మియాలు, గోద్రేజ్‌లు, బజాజ్‌లు, థాపర్‌లు, సింఘానియాలు, మఫత్‌లాల్‌లు పులి ముందు పిల్లుల వలె తలలు వాల్చేస్తున్నారు. టాటాల చేతిలో వున్న పెప్సి కంపెనీని పూత మన్నారు; గోద్రేజ్ సబ్బుల కర్మాగారం ప్రాక్టర్ అండ్ గాంబిల్ పరమైంది. టాటాల సబ్బులు, టూత్ పేస్టులు, డిటర్జెంట్‌ల కంపెనీని హిందుస్తాన్ లివర్ పెరుక్కున్నది. బిన్నాని టెలివిజన్‌ను సౌత్ కొరియా వారు కొనేశారు. మల్హోత్రాల బ్లేడుల కర్మాగారం చేజారి పోయింది. ఒక్కొక్కటెందుకు - చెప్పుకుంటూ పోతే మనం దశాబ్దాల తరబడి వాడే పెన్నుల, బ్రాండ్‌ల వస్తువులలో దేశం 90 శాతం విదేశీ కంపెనీల స్వాధీనమై పోయాయి. వినియోగ వస్తువులలో దేశంలో ప్రాచుర్యంలో వున్న 60 బ్రాండ్‌లలో 50 కి పైగా విదేశీయుల పరమైనట్లు అంచనా. మిగిలినవి నష్టాలలో పడి అదృశ్యమై పోయే ప్రమాదం ఏర్పడింది. హిందూస్థాన్ లివర్‌ను ముప్పతిప్పలు పెట్టి



కంపెనీలు వారి వశం కావడానికి ప్రభుత్వం అనుమతిస్తున్నది; కాని, అదే స్వదేశీ పారిశ్రామిక వేత్తలు తమ వాటాను పెంచుకో జూస్తే డిస్కౌంట్ రేట్లకు ఒప్పుకోవడం లేదు. విదేశీ కంపెనీలు క్యాపిటల్ గెయిన్స్ 30 శాతం కడితే చాలు- మన వారు 57.5 శాతం కట్టాలి; విదేశాల నుంచి దిగుమతయ్యే ముడి పదార్థాలు, యంత్రాలు, ఇతర వస్తువుల పై కస్టమ్స్ సుంకం తగ్గించేశారు; కాని స్వదేశంలో తయారయ్యే వస్తువుల పై ఎక్సైజ్ పన్నును అపరిమితంగా పెంచారు. దీని వల్ల విదేశీ కంపెనీల వస్తువుల కంటే మన స్వంత వస్తువుల ధరలు పెరిగి పోతున్నాయి. ఇక పోటీ ఎక్కడ వీలౌతుంది? నాణ్యత ఎట్లా పెరుగుతుంది?

మన్మోహన్ సింగ్ విదేశీ కంపెనీల కెంత సాగిలబడి దాసోహ మంటున్నారంటే, - వారు మన దేశంలో స్థాపించే కరెంటు ఉత్పాదన అవసరం వుందా? వారితో మన వాళ్లెట్లా పోటీపడి పని చేయగల్గుతారు?

ఈ పరిస్థితి ఇట్లానే కొనసాగితే కొద్ది కాలంలోనే టాటాలు, బిర్లాలతో సహా అందరూ తమ పరిశ్రమలను అమెరికాకో, జపాన్‌కో అమ్మేసు కొని వారికే ఏజంట్లుగా, డీలర్లుగా అంగళ్లు తెరచుకొని బ్రతకాల్సిన దుర్గతి దాపురిస్తుంది. టిస్కో కంపెనీ అప్పుడే సీమలెస్ పైపులు అమ్మే ఏజెన్సీ స్వీకరించింది. తక్కిన వారికి ఈ దుర్గతి దాపురించేందుకు ఎంతో వ్యవధి లేదు.

మన్మోహన్ మితిమించిన విదేశీ మోజు వల్ల వినిమయ వస్తువుల రంగంలోనే కాక - దేశ మౌలిక పారిశ్రామిక రంగమే దెబ్బ తిని పోయే ప్రమాదం వుంది. ఉన్నత సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన కంప్యూటర్లు, విమానాలు, కార్లు, స్టీలు, పారిశ్రామిక రసాయనాలు, యంత్ర పరికరాలు

## హైల్ కపిల్!

- రసిక్ -

తనకంటూ ఒక గమ్యాన్ని
నిర్దేశించుకొని
అగమ్యం అందరాని
ఎత్తువవున్నా,
అడుగడుగునా అవరోధ శకలాలు
తారసపడుతున్నా
యాత్ర అనంతంగా గోచరించి
కలవర పెడుతున్నా
ముదిమి బెబ్బులి యై మీదకు
వచ్చి పడుతున్నా
పట్టువీడకుండా, వెన్ను
జూపకుండా
పరాక్రమంతో విక్రమించిన
ప్రతాపశూరుడై పురోగమించిన
వీరునకు విజయం తథ్యమని
మరో మారు
విశ్వమంతా వెల్లడైంది;
ఆసేతు శీతనగ పర్యంతం
పులకించి
ఆ వీరుని పై సేసలు చల్లుతోంది

* * *

పుట్టిన దేశానికి తన సేవలతో
పులకలు రేకెత్తించడం
ఒట్టి మాట కాదు;
అది మహత్తర జీవన సాఫల్యం
అలా సఫలురైన ప్రతిభావంతుల్లో
క్రీడాజగత్తుకు సంబంధించి
క్రీడి వంటి వీరులొక్కక్కరుగా
తలెత్తుతున్నారు మనదేశంలో

* * *

బిలియర్డ్సు క్రీడలో
భారతీయుల కీర్తి
వెలుగుతోంది విశ్వాన్ని
రేపో మాపో రేచులా
దూసుక వెడుతూ

ఉరుకుల ఉషమార్గంలో
ఒక భారతీయ మహిళ
కాగలదు తప్పక
ప్రపంచ పరుగుల రాణిలా;
రేపో మాపో చదరంగంలో
ప్రపంచ విజేతగా గర్వంగా
ఒక భారతీయుడు నిలువ గలడు
ఆనంద స్వరూపుడై

* * *

ఈ ఆశలు చివురించేందుకు
రంగాన్ని సిద్ధం చేసిన వారిద్దరు
ఒకరు నిన్నటి గవాస్కర్
ఇంకొకరు నేటి కపిల్ దేవ్

* * *

ఎవరు కలగన్నారీ దేశంలో
అంతర్జాతీయ క్రికెట్
టెస్ట్ రంగంలో
గవాస్కరు వంటి విశ్వవిజేత
బ్యాట్స్‌మెన్
కపిల్ వంటి విశ్వవిజేత
పేస్ బౌలర్ పుట్టుక వస్తారని?
అనుకొన్నది సాధిస్తారని?
ఈ ఇరువురూ మన
సమకాలికులైనందుకు
ఎంతగా ఉప్పొంగి
పోవాలి మనం?

* * *

ఉత్తమోత్తమ బౌలరుగా
అరుదైన ఆల్‌రౌండరుగా
అసాధ్యాన్ని సాధ్యం
చేయవచ్చునన్న
ఆదర్శానికి ప్రతిబింబంగా
చెక్కు చెదరని ఆరోగ్యానికి
సంకేతంగా
మొక్కవోని ధైర్యానికి ప్రతీకగా
బన్నుల కొద్దీ చెమటలు క్రక్కుతూ
కన్నుల నిండా ఆశలు చిమ్ముతూ
విజయలక్ష్మి చెనకు తన్నూ,
తన దేశాన్ని
వికెట్‌లు పడగొడుతూ తీసుకెళ్లిన
ఈ ''హార్యానా హారికేన్'' కు
ఈ రోజున ముక్తకంఠంతో
అభినందనల నందిద్దాం
'హైల్ కపిల్, హైల్ కపిల్' అని

# సబ్బు తయారు చేసుకోలేని అజ్ఞానంలో వున్నామా?

చేస్తున్నారు.

రెండేళ్ల క్రితం మన్మోహన్ సింగ్ తొలిసారిగా లైసెన్సులు, పర్మిట్ల ఆటంకాలను తొలగించి నప్పుడు సంతోషంతో చంకలు తట్టుకున్న భారతీయ పారిశ్రామిక వేత్తలు, అది తమ మెడకు పడబోతున్న ఉచ్చు అని ఆలస్యంగా గ్రహించారు. భారతీయ పరిశ్రమలను, స్వదేశంలో వస్తోత్పత్తిని అంతం చేసే రీతిలో శరవేగంగా మలుపులు తిరుగుతున్న పరిణామాలను వారు అర్థం చేసుకొనే లోపలే ప్రమాదం జరిగిపోయింది.

టూత్ పేస్టులు, స్నానం సబ్బులు, గుడ్డలుతికే పౌడర్లు, కూల్ డ్రింక్‌లు, జాములు, తొడుక్కునే చొక్కాలు, రెస్టారెంట్లు, చిరు తిండి పదార్థాలు, చాకిలెట్లు, కాఫీ, టీ పొడర్లు, ఆఖరకు త్రాగే విదేశీ బిరకేశారు; థమ్స్ అప్ చౌహాన్ తన సామ్రాజ్యాన్ని కోకా కోలా పాదాల చెంత పెట్టి ప్రక్కకు తప్పుకొన్నారు. విజయ్ మాల్యా కిసాన్ జాముల రుచిని బ్రూక్ బాండ్‌ను అనుభవించ

> ఈస్టిండియా కంపెనీ కాలంలో వలె ముడి పదార్థాలు ఎగుమతి చేసి వస్తువులు దిగుమతి చేసుకొనే దుస్థితికి దిగజార్తున్నాము!

భారతీయుల ఆదరణకు నోచుకున్న నిర్మా అమ్మకాలు గత ఏడాదిలో పోల్చితే (243 కోట్లు) ఈ ఏడాదికి (186 కోట్లు) 24 శాతం పడిపోయాయి. ప్యూర్ డ్రింక్స్ వారి క్యాంపాకోలా అమ్మకాలు గణనీయంగా తగ్గిపోయాయి. తగ్గక ఏమి చేస్తాయి? పెప్సికోలా, కోకా కోలాలు పబ్లిసిటీకి, కొత్త ప్యాకింగ్‌లకు ఏటా 25 కోట్లకు మించి ఖర్చు పెట్టబోతున్నాయట. అంతంత డబ్బు మనకెక్కడిది?

విదేశీ ఉత్పత్తులు వస్తే, పోటీ పెరిగి మన ఉత్పత్తుల నాణ్యత పెరుగుతుందన్నది వట్టి భ్రమ. మన్మోహన్ సింగ్ మన వారికి అంత అవకాశం ఇవ్వడం లేదు. విదేశీ సంస్థలు భారతీయ కంపెనీలలో తమ వాటాను 50 కి మించిన శాతానికి పెంచడానికి, తద్వారా ఆయా పరిశ్రమలకు కనీసం 16 శాతం లాభాలు అందించేందుకు గ్యారంటీ

> సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన రంగాలలో విదేశీ కంపెనీలు ముందుకు రావడం లేదు; సాధారణ పరిశ్రమల కోసం పోటీ పడ్తున్నాయి!

ఇచ్చారు. నష్టం వస్తే ప్రభుత్వం పరిహారం కట్టించే ఒప్పందం పైన విదేశీయులను ఆహ్వానించ వలసిన వంటి పరిశ్రమల రంగంలో విదేశీ కంపెనీలు తమ సాంకేతిక పరిజ్ఞానం తెచ్చి ఇక్కడ పరిశ్రమలు అభివృద్ధి చేస్తే వారూ లాభపడతారు. మనకూ ఉద్యోగావకాశాలు పెరగడంతో పాటు, ఆ విజ్ఞానం అందుబాటౌతుంది. వారిని ఉన్నత సాంకేతిక పరిజ్ఞానాధార పరిశ్రమలకు పరిమితం చేసి, వినిమయ వస్తోత్పత్తికి భారతీయ పరిశ్రమలకు ప్రోత్సహిస్తే ఉభయతారకంగా వుంటుంది. టూత్‌పేస్టును స్వంతంగా తయారు చేసుకోలేని అజ్ఞానంలో మనమేమీ లేము కదా? ఏ విదేశీయుడూ అటువంటి ఆధునిక పరిశ్రమలను మన గడ్డ మీద స్థాపించ చూడటం లేదు. వాటిని తమ దేశాలలోనే తయారు చేసి చవకగా అమ్మేస్తున్నారు. సాంకేతిక

కొరవ 7 పేజీలో

# కుల దావానలం

కులం ప్రాతిపదికగా రాజకీయాధికార సాధన కోసం బహుజన సమాజ్ పార్టీ చేస్తున్న ప్రయోగం ఆదిలోనే వికటించి విష పుష్పాలు పూస్తున్నది. మతం పేరుతో ఓట్లు రాబట్టు కోవడానికి బిజెపి పన్నుతున్న పథకాల వల్ల దేశానికి జరుగుతున్న అపకారం కంటే ఏ మాత్రం తీసి పోవడం లేదు బిఎస్‌పి ప్రణాళికల ఫలితం.

ఉత్తరప్రదేశ్‌లోని వారణాసిలో గతవారంలో కులం కార్చిచ్చుకు నలుగురు విద్యార్థులు ఆహుతై పోయారు. ములాయం సింగ్ యాదవ్ మంత్రి వర్గ సభ్యుడు. బిఎస్‌పి నాయకుడూ అయిన దీనానాథ్ భాస్కర్ అనుచరుడొకర్ని 4 తేది ఎవరో హత్య చేశారు. దానికి ప్రతిస్పందించిన ఆ మంత్రిగారు- రాష్ట్రంలో ఒక్క బిఎస్‌పి కార్యకర్తను చంపితే ముగ్గురు అగ్రవర్ణాల వారిని చంపి ప్రతీకారం తీర్చు కుంటామని శపథం చేశారు. ఆయనా ప్రకటన చేసిన ప్రక్కరోజే 7తేది- వారణాసి విశ్వ విద్యాలయంలో చదువుతున్న ఇద్దరు రాజపుత్ర విద్యార్థులను, ఒక బ్రాహ్మణుడ్ని చంపారు. సహజంగానే అనుమానం శపథం చేసిన మంత్రి పుంగవుడి పైకి వెళ్లింది. వారణాసి జిల్లా అంతా ఉద్రిక్తతతో అట్టుడుకి పోతున్నది. మంత్రి గారిని బలమైన పోలీసు బందోబస్తు మధ్య లక్నోలో దాచి వుంచారు. ఆయన చేత పదవికి రాజీనామా చేయించాలని కాంగ్రెస్‌తో సహా ప్రతి పక్షాలన్నీ కోరుతున్నాయి. ముఖ్యమంత్రి మాత్రం న్యాయ విచారణ కాదేశించి సరిపెట్టు కున్నారు. అతడి రాజీనామా కోరితే బహుజన సమాజ్ పార్టీతో పేచీ వచ్చి ప్రభుత్వం పడిపోతుందని యాదవ్ భయం.

కాన్పూర్‌లో అగ్ర వర్ణాల వారు ఒక హరిజన మహిళను వివస్త్రను చేసి రోడ్లో బహిరంగంగా త్రిప్పారు. ఈ దుర్ఘటన ఆ ప్రాంతంలో ఇరు కులాల మధ్య చిచ్చు రగిల్చింది. ఇక్కడా న్యాయ విచారణ కాదేశించి చేతులు దులుపు కున్నారు ముఖ్యమంత్రి.

బహుజన సమాజ్ పార్టీకి చెందిన మరొక ఎమ్మెల్యే ఒక పేద యువతి[ని] పట్టి, బంధించి, కిరాతకంగా మానభంగం చేశాడు. ఈ [సం]ఘటన బయటకు వచ్చి అలజడి రేగడంతో ఆ యువతిని పోలీసుల సహాయంతో చంపడానికి ప్రయత్నించారు. బిజెపి ఎమ్పీ ఉమాభారతి ఆ యువతిని రక్షించడానికి వెళ్తే, ఆమె పైకి పోలీసులు కాల్పులు జరిపారట. ఆమె బాడీ గార్డులు ఎదురు కాల్పులు జరిపి, రక్షించారు. సంబంధిత జిల్లా కలెక్టరు మహిళ కావడంతో, ఆమె సాహసించి, పోలీసుల నెదిరించి, ఆ యువతిని క్షేమంగా ఢిల్లీకి చేర్పించింది. అందుకు శిక్షగా, బిఎస్‌పి నాయకులు ఆ కలెక్టర్‌ను రాత్రికి రాత్రి బదలీ చేయించారట. అంతే తప్ప మానభంగానికి తలపడి ఆ నేరం కప్పిపెట్టు కోను ఆ అభాగ్యురాలిని అంతం చేయడానికి కూడా ప్రయత్నించిన తమ ఎమ్మెల్యేను మందలించను కూడా లేదు. ముఖ్యమంత్రి నుంచీ ఉలుకు, పలుకు లేదు.

అధికారంలోకి వచ్చిన తొలి రాష్ట్రంలోనే బహుజన పార్టీ నాయకులు ఇట్లా ప్రవర్తించడం శోచనీయం. పగ, ప్రతీకారాలతో, అరాచక విధ్వంసాలతో, అగ్ర వర్ణాలు, అణగారిన వర్ణాల మధ్య విద్వేషం రగిలించడం ద్వారా తమకు సంక్రమించిన పాలనాధికారాన్ని దుర్వినియోగం చేయ చూడడం క్షంతవ్యం కాదు. అరాజకం, హింస, విధ్వంసాల ద్వారా ఎవరూ ఏ వర్గాన్నీ అదుపు చేయలేరు. ప్రజలు తమకు ఇచ్చిన అవకాశాన్ని తరతరాలుగా సామాజిక దోపిడీకి గురైన తమ వర్గం ప్రజల జీవన వికాసానికి వినియోగించ గల్గితే బహుజన సమాజ్ పార్టీ స్థాపన లక్ష్యం నెరవేరుతుంది. సాంఘిక, ఆర్థిక, రాజకీయాది రంగాలలో అట్టడుగు వర్గాల అభ్యున్నతికి పథకాలు రచించి, అమలు చేయడం జరిగితే తమ ప్రభుత్వ ఏర్పాటుకు సార్థకత చేకూరుతుంది. ఈ మహత్తర కృషిలో అగ్ర వర్ణాల వారి సహకారాన్ని తీసుకోవడం వాంఛనీయం. ప్రభుత్వం వుండేది కేవలం ఒక వర్గ ప్రజల కోసమేనని, లేదా ఒక వర్గాన్ని అణచి వేయడానికన్న దురభిప్రాయాలు ప్రబలితే, ఒక ప్రధాన వర్గం ప్రజల విశ్వాసాన్ని కోల్పోతే అది అరాజకానికి దారి తీస్తుంది.

**జమీన్‌రైతు**

ప్రజాస్వామ్యంలో అత్యంత ప్రమాద కరమైన అంశం- అభద్రతా భావం. కాన్షీరాం, వంటి నాయకులు తమ ప్రవర్తనను, ప్రసంగాల తీరును ఆత్మ పరిశీలన చేసుకొని తమ కార్యకర్తలను అదుపు చేయడం ద్వారా కుల విద్వేషాలు రేకెత్త కుండా జాగ్రత్త పడాలి. లేకుంటే అది దావానలమై సామాజిక వ్యవస్థను దగ్ధం చేస్తుంది.

# అంబేద్కర్ ''పేరు'' పై ఇంత రభస ఎందుకు?

మంచి మనిషి చేసే ఉపకారానికి చాటింపు లేకున్నా అది ప్రజలలో గుర్తింపు పొందుతుంది. మహారాష్ట్రలో 15 సంవత్సరాలుగా వున్న మరాఠ్వాడా యూనివర్శిటీ పేరును మార్చడం సబబుకాదు అట్లా మార్చినందుకు వ్యతిరేకిస్తూ అలజడి చేయడమూ సమస్యకు పరిష్కారం కాదు. ఇది కేవలం ప్రజల మనోభావాలను రెచ్చగొట్టే చర్య. జాతికి మార్గ దర్శకుడైన అంబేద్కర్‌ని ప్రతి భారతీయుడూ గౌరవించాల్సిందే. ఆయన దళితులకు చేసిన సేవ వర్ణించలేనిది. కాని ఆయన తన పేరుకోసం, పేరు పెట్టడం కోసం తన ముందు తరాలవారు ఇంత దారుణాలు సృష్టిస్తారని వూహించివుంటే ఇంత సేవ చేసి వుండేవారు కాదేమో! ఒక శాంతి యోధుని వారసులము, అభిమానుల మనేవారు ఈ విషయాన్ని పరిశీలించాలి. కేవలం ఒక సాకును ఆసరా చేసుకొని ఎన్నో సంవత్సరాలుగా వున్న మరాట్వాడా పేరును మార్చడం సరియైన చర్య కాదు. అంబేద్కర్ గారిపై అభిమానం ప్రదర్శించాల్సిన పద్ధతి ఇది కాదు. క్రొత్తగా నిర్మించిన ఏ యూనివర్శిటీకో, హాస్పిటల్‌కో ఆయన పేరు పెట్టి వుంటే బాగుండేది. అందరూ ఈ విధానాన్ని హర్షించేవారు. ఈ పేరు పెట్టడమే ఒక రాజకీయ కుట్ర. రాజ్యాంగ నిర్మాత అంబేద్కర్ గారితో రాజ్యాంగ రచనా మండలిలో పని చేసినవారు ఇంకా వున్నారు. వారి పేర్లు ఎక్కడ పెడతారు? వాళ్లు మహానుభావులు కాదా!

-ములుమూడి జనార్ధనరావు.

## మన్‌మోహన్ ది గ్రేట్!

ఆర్థిక మంత్రి మన్ మోహన్ సింగ్ దేశం యావత్తూ గర్వపడే ఆర్థిక వేత్త. ఆర్థిక మంత్రిగా ఇంత అంకిత భావంతో పనిచేసే వారు మరొకరు కనబడరు. దేశంలోని ధనిక, మధ్య తరగతి,పేద వర్గాలను ఒకే దృష్టిలో పెట్టుకుని ఆర్థిక సరళీకృత విధానాలు రూపొందిస్తున్న వ్యక్తాయన. లైసెన్సు, పర్మిట్ రాజ్యాన్ని చక్కదిద్దిన

## జనవాణి

అభ్యుదయ వాది. ఆయన సిద్ధాంతం భారత దేశంలోని ప్రతి మధ్య తరగతి కుటుంబం దినాన 200 రూపాయలు సంపాదించి 180 రూ. ఖర్చుపెట్టి 20 రూపాయలు పొదుపు చేయాలని ఆకాంక్ష. దీన్ని సాధించేందుకు ఆయన ప్రస్తుతం తీసుకొంటున్న చర్యలు కష్టమనిపించినా ఏదో ఒక రోజు అవి సత్ఫలితాలిచ్చి ప్రజలకు మేలు చేకూర్చుతాయి.

గూడూరు - ఆవుల కొండయ్య.

## ఎస్పీబాలుగారూ- త్యాగరాజును మరువకండి!

ప్రతి సంవత్సరం సింహపురి ప్రజలు ఆసక్తితో ఎదురుచూసే త్యాగరాజ ఉత్సవాలు మార్చిలో నెల్లూరులో జరుగనున్నాయి. గత పది సంవత్స రాలుగా అవి చాలా చప్పగానూ, నీరసం గానూ జరుగు తున్నాయి. క్రిక్కిరిసి వుండాల్సిన జనం, పందిళ్లలో పల్చగా వుంటున్నారు. పూజ్యులు స్వర్గీయ సాంబమూర్తి గారి హయాంలో ఉత్సవాలు బాగా జరిగేవి. కాని ఆయన కుమారుడు ప్రఖ్యాత నేపథ్య గాయకులు ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం తన తండ్రి ప్రారంభించిన ఒక మహత్తర సాంప్రదాయం పట్ల నిర్లక్ష్యం ప్రదర్శిస్తున్నారు; అది తనకు సంబంధించినది కాదనన్నట్లు వుంటున్నారు. ఆ లోటు పూర్చను ఎస్పీ ఈసారి కర్ణాటక సంగీతంలో దిగ్గజాలైన ఎం.ఎస్. సుబ్బలక్ష్మి, బాల మురళీ కృష్ణల కచ్చేరి ఏర్పాటు చేయించి నెల్లూరు ప్రజలను ఆనంద డోలికల్లో ముంచెత్తాలని మనవి.

నెల్లూరు -ఎస్.వి.సుబ్బారావు.

## ప్రయాణం లోనే టిక్కెట్ల చెకింగ్ చేయండి!

ఆర్టీసి బస్సులలో టిక్కెట్లను చెకింగ్ చేసే అధికారులు ఎక్కడ పడితే అక్కడ బస్సులను ఆపి,

కొరవ 11 పేజీలో

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

11.2.1944

పేజీలు 6, వెల 0-1-6

### గ్రామసీమలు

#### గూడూరు సినిమా

ఈ ధనలక్ష్మి టాకీస్‌తో యెగ లేకుండ వున్నాము సార్; మొదట ఆట సా. 8.1/2 గంటలకు ప్రారంభం, రాత్రి 2.1/4 గంటలకు విడుస్తు[న్నది]. రెండవ ఆట చాలించేటప్పటికి తెల్లవా[రు] 41/2 గం.లు అవుతున్నది. [విధి] భోగోతం మాదిరి మా దుంప తెగుతున్నది. ఫిలిములు గూడ అల్పాసల్లీఖా దినాల నాటివి. అమిత విసుగు. దీనికి రెమిడీ ఎట్లా?

- ప్రేక్షకాళి

#### నెల్లూరులో సంత

మార్చి 7 నుండి 11 వరకు జరుగును.

రైతులు ఉత్తమమైన కూరగాయలు, పండ్లు, పశువులు, పొట్టేళ్లు, కోళ్లు మున్నగునవి పంపి బహూకర ణాలంద ప్రయత్నింపుడు.

. - ప్రదర్శన సంఘం.




#### ఇసనాక వెంకయ్య అస్తమయం

యువకుడు, ప్రజల ఆదరణాభిమానముల చూర గొన్నవాడు, నిరంతర దరహాసభరితుడు, స్నేహపాత్రుడు, ఇసనాక వెంకయ్య (యల్లాయపాళెం) ఈ నెల 3 తేది అకాల, ఆకస్మిక మరణమునకు పాల్పడెను. కాంగ్రెస్ భక్తుడు, కాంగ్రెసు దీక్షమెందు. 1930 సత్యాగ్రహములో పాల్గొని జైలుకు వెళ్లిన కార్యోత్సాహి.

మిషన్ స్కూలులో నాతో చదివినవాడు, రెడ్డి హాస్టలులో నాతో నుండిన వాడు, వారి నలుగురి బిడ్డలను, భార్యను, తల్లిని, సోదరిని, చిన్నాయన రంగారెడ్డి గారిని ఓదార్చుట [దుస్స]రమైన కార్యమే. వెంకయ్య నమ్రత, పెద్దల నేర్చుకొన వలసిన గుణములు, వారి ఆత్మకు శాంతియగు గాక.

బెజవాడ గోపాలరెడ్డి
బుచ్చిరెడ్డిపాళెం. 9-2-44.

#### వి.ఆర్.కాలేజి పాత విద్యార్థి సంఘం

ఈ సంఘ వార్షి కోత్సవం ప్రతి వేసవిలో జరగడం, అప్పుడే ఎన్నికలు గూడా జరగడం మామూలు. గత వేసవి పోయి 7 మాసాలైనా కథముందుకు నడవలేదు. నోటిమాటలతో చెప్పి చెప్పి విసుగెత్తి పాత విద్యార్థులు సంయుక్త కార్యదర్శులకు నోటీసిచ్చారు. జనరల్ బాడీని సమావేశ పరచమని.

ఈ నోటీసు జారీ చేయడం గూడ చాల కష్టమైంది. దానిపై విధిలేక 19-12-43 న జనరల్ బాడీ మీటింగు వకీలు పెళ్లకూరు చంద్రశేఖర రెడ్డి గారి అధ్యక్షాన జరిగింది. దానిలో 2-1-44 న వార్షికోత్సవం జరపమని తీర్మా నించారు. కాని యీ లోపల చారిత్రాత్మక సంఘటనలు జరిగాయి. పాత విద్యార్థి పేరుతో కాలేజి కమిటీ మీద జిల్లా కోర్టులో ఒక యింజక్షన్ దావా వేశారు. మున్సిఫ్ కోర్టులో మరొక పాత విద్యార్థి పేరుతో 2-1-44 తేది ఎన్నికలు జరపకూడదని యింజక్షన్ ఉత్తర్వు పుట్టింది. కోర్టు ఉత్తర్వు ఎన్నికలు జరప కూడదని మాత్రమే. కార్యదర్శులు జనరల్ బాడీయే జరుగ కూడదని కర పత్రాలు పంచారు. హాలికుని అధ్యక్షత క్రింద జనరల్ బాడీ కూడినది. దాని ఎదుట కొచ్చి సమర్థించుకొనుటకే కార్యదర్శులకు గుండె చాలలేదు. ఒక కార్యదర్శి మాత్రం వచ్చి దీనితో మాకేం సంబంధం లేదని, దీనిలో జోక్యం పుచ్చుకొనుట కోర్టు ఆజ్ఞను ధిక్కరించుటే నని వెర్రి వెంగళాయి వ్యాఖ్యానాన్ని వెల్లించి వెళ్ళారు. ఆ సభలో సంఘ నిధిని జనరల్ బాడీ ఉత్తర్వు లేనిదే ఖర్చు పెట్టరాదని, 16-1-44న తిరిగి జనరల్ బాడీ సమావేశము కావలెనని తీర్మా నించినారు.

కొరవ 10 పేజీలో

సుబ్రహ్మణ్య భారతి జాతీయ కవితా స్ఫూర్తికి ఒక్క తమిళనాడే కాదు,
యావద్భారత జాతీ రుణపడి వుంటుంది!

# భారతీయ కవితకు 'భారతి' పట్టిన హారతి!

మన దేశంలో ఆర్యభాషలు ఉత్తరదేశ భాషలుగా ద్రావిడ భాషలు దక్షిణ దేశ భాషలుగా వ్యవహరింప బడుతుంటాయి. ఈ భాషలలో సంస్కృతం ఉత్తర భారతంలోను, తమిళం దక్షిణ భారతంలోను గొప్ప చరిత్రలు సృష్టించాయి. తమిళ సాహిత్య యుగంలో సంగం యుగం ప్రధానమైనది. ఈ యుగంలో అనేక సంకలన గ్రంథాలు గేయాలు వెలువడ్డాయి.

భక్తి ఉద్యమాన్ని కుల భేదం లేకుండా సుసంపన్నం చేసిన వారు ఆళ్వారులు, నాయనార్లు; తర్వాత తమిళ కవిత్రయ అవతరణ జరిగింది. నాయక రాజుల కాలంలో తమిళ సాహిత్యం కొంత వరకు పోషింప బడింది. సృజనాత్మక, భావనాత్మక ప్రతిభ లోపించిన తరుణంలో తమిళ భాష మరో మార్గంలో ప్రయాణం చేయడం అనివార్యమైంది. కానీ తమిళ కవిత్వాన్ని వచనంతో పాటు పూర్తిగా ఆధునికం చేసే వ్యక్తి అవసరమయ్యారు. ఆ ఆశయానికి అనుగుణంగా అవతరించిన వారే సుబ్రహ్మణ్య భారతి. ఆయన మానవ భవితవ్యాన్ని లక్షించిన ప్రవక్త. భారతి గేయకవిగా, జాతీయ కవిగా, అభ్యుదయ కవిగా, అసలైన సిసలైన మానవతా వాదిగా ప్రసిద్ధుడయ్యాడు. ఆయన కవిత, దేశ సేవ, బద్ధకము లేమి అనే మూడు అంశాలే తన జీవిత లక్ష్యంగా పెట్టుకొన్నారు. ఆయన అక్షరాలా జాతీయ కవి. దేశాభిమానం భాషాభిమానం ఆయన రచనలో దర్శన మిస్తుంటాయి. ఆసేతు హిమాచలంలో వుండే విభిన్న మతాల వారు, విభిన్న భాషల వారు భారతీయులేనని వారి సిద్ధాంతం. అటువంటి తమిళ కవితా పితామహుడు సుబ్రహ్మణ్య భారతి తిరునల్వేలి జిల్లా ఎట్టయాపురంలో 1882 డిసెంబరు 11వ తేది జన్మించారు. తండ్రి చిన్నసామి అయ్యర్; తల్లి లక్ష్మీ అమ్మాళ్. తండ్రి

పెద్ద బాల్యంలో కురళ్ కంబరామాయణం చదివాడు. ఆయన అసలు పేరు ఎట్టయాపురం సుబ్బయ్య. ఎట్టయాపురం ఒక చిన్న జమిందారీ గ్రామం. సుబ్రహ్మణ్యం తండ్రి జమీందారీ కొలువులో ఉద్యోగి. బాల్యంలోనే ఆయనకు మాతృవియోగం కలిగింది. 9 వ సంవత్సరం నుండి



కవి పండిత గోష్ఠులలో పాల్గొనేవాడు. తన 11 వ ఏటనే భారతి అనే బిరుదు పొందాడు. ప్రాథమిక విద్య ఎట్టాయాపురంలోను, ఉన్నత విద్య తిరునల్వేలి హిందూ కళాశాలలోను అభ్యసించాడు. ఇంతలో ఆయనకు వివాహం జరిగి పితృవియోగం కలిగింది. 1901 కాశీ వెళ్లి అలహాబాద్ విశ్వవిద్యాలయ సంస్కృత హిందీ ప్రవేశ పరీక్షలలో మొదట తరగతిలో ఉత్తీర్ణుడయ్యాడు.

ఆర్థిక బాధల వల్ల చదువు కొనసాగించలేక జీవనోపాధికై శ్రమపడసాగాడు. ఎట్టయాపుర యువరాజుకు తమిళ బోధకుడుగా కొద్ది కాలం గడిపాడు. 1904లో సుబ్రహ్మణ్య భారతి మధుర చేరి అక్కడ సేతుపతి హైస్కూలులో 3 నెలలు తమిళ పండితుడిగా పనిచేశాడు. ఉపాధ్యాయ వృత్తి చాలీ చాలనిదిగా కన్పించింది. తర్వాత మద్రాసు చేరారు. ఎట్టయాపురం తిరిగి వచ్చి జమీందారీ కొలువులో ప్రవేశించాడు. రెండేళ్లు జమీందారు సహచరునిగా ఉద్యోగం నిర్వహించాడు. అప్పుడు సుప్రసిద్ధ దేశభక్తుడు జి. సుబ్రహ్మణ్య అయ్యర్ నడుపుతున్న చెన్నపురిలోని 'స్వదేశమిత్రన్' అనే తమిళ వార పత్రికకు సహాయ సంపాదకుడై 1904 నవంబర్‌లో అక్కడ పనిచేశారు. చక్రవర్తిని మాసపత్రికకు సహాయ సంపాదకుడుగా వుండినాడు. ఈ ఉద్యోగం వల్ల ఆయనకు ఆర్థిక కష్టాలు తొలగలేదు. వివేకానంద, అరవింద ఘోష్, బాలగంగాధర తిలక్ వంటి నాయకుల మాటలను ఉపన్యాసాలను తమిళంలో అనువదిస్తూ కొంతకాలం గడిపారు. తర్వాత బాలభారతి, ఇండియా తదితర పత్రికలకు సంపాద కుడయ్యాడు.

జాతీయ రాజకీయాలలో నిమగ్నుడు కావడం వల్ల ఆయన రచనలలో వినూత్నమైన శక్తి ఏర్పడింది. పత్రికా ఉపసంపాదకత్వం ఆయనను రాజకీయ రంగానికి సన్నిహితం చేసింది. 1905 లో బెనారస్‌లో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశానికి భారతి హాజరయ్యారు. అక్కడ నివేదిత సోదరిని కలిసారు. ఆమె శిష్యరికం వల్ల భారతిలో రాజకీయ స్వాతంత్ర్యం, వర్ణవిభేద నిర్మూలనం, స్త్రీ విముక్తి, అనే లక్ష్యాలు ఏర్పడ్డాయి. కాంగ్రెస్‌లో ఏర్పడిన చీలికలలో భారతి అతివాద పక్షం వైపు మొగ్గుచూపాడు. దీనివల్ల భారతి కవితా విహంగం క్రొత్త రెక్కలను సంతరించుకొన్నది. ఆయన కవిత్వం స్వాతంత్ర్య సంగీతాన్ని ఆలపించింది. రాజకీయ మితవాదుల పట్ల విమర్శనాస్త్రాలను ఝుళిపించింది. స్వార్థపరులను తూర్పార పట్టింది. గాంధీని ప్రస్తావిస్తూ మహాత్మాగాంధీ పంచకాన్ని భారతి వ్రాసాడు. గురుగోవింద సింగ్‌ను గూర్చి రెండు వందల నాలుగు పాదాల దీర్ఘ కవితలు వ్రాసాడు. చిత్రకారుడైన రవివర్మను ప్రశంసించారు. వివిధ ప్రాంతాలకు చెందిన మహనీయులను తన రచనలో ప్రశంసించి తన జాతీయతా దృక్పథాన్ని చాటాడు.

ఒక సంఘ సంస్కరణ

> డాక్టర్ ఉడాలి
> నరసింహ శాస్త్రి
> ఎం.ఎ. పి.హెచ్.డి.

ఉద్యమంలో సభ్యుడై వర్ణాంతర పంక్తి భోజనాలలో పాల్గొన్నాడు. రాడికల్ సోషల్ రిఫాం పత్రికలో ఆయన రచనలు ప్రకటితమయ్యాయి. ఒక

కొరవ 10 పేజీలో




సిటిజన్స్ క్లబ్ అధ్యక్షుడిగా ప్రమాణం చేస్తున్న [illegible] భాస్కర రావు. సిటిజన్స్ ఎ.ఎస్.పి. కృష్ణంరాజు, కె.కె. రెడ్డి, ఆనం వివేకానంద రెడ్డి [illegible] వున్నారు.

అవి-ఇవి

మన ల్లిగాని గుర్తు పట్ట లేదు..కదా? ఎక్స్ ఛేంజ్ గవర్నర్‌గారు

ఎస్పీజిఆర్ వేగులపై - ఆమ్యూళ్ల లిగ్రహం

రాజకీయాల్లో గూండాలు స్మగ్లర్లు

రాష్ట్రం లో సదస్సుల గాలి బాగా వీస్తుంది. ఇంతకు ముందు వాటి వరణం లో ఎలాంటి మార్పులే..

..మన ఊరు ఉత్తమ పంచాయ తీగా ఎన్నికైనదటగా...?!?

అవును

# మద్రాసులో ఒకప్పుడు మెజారిటీ జనం మనమే!

గత సంచిక తరువాయి

చెన్నపురిలో వెలసిన మొదటి శతాబ్ది కాలంలో అంటే దాదాపు క్రీ.శ.1750 వ సం. వరకు ఈ నగరాన్ని సందర్శించిన ప్రధాన విదేశీ యాత్రికుల వ్యాఖ్యలను పరిశీలిస్తే ఆ నగర ప్రధాన వాసులు తెలుగు వారని తెలుస్తుంది. కోటలోను, నల్లవారి (స్థానికుల) పేటలలోనూ తెలుగు వారు వృత్తుల వారిగానూ, కులాల వారిగానూ సమీకరించబడి వుండినారు. రెండవ స్థానం తమిళులది (అరవవారు). అధిక శాతం తెలుగు వారు చెంగల్పట్టు, నెల్లూరు మరియు ఉత్తర, దక్షిణ ఆర్కాటు జిల్లాల నుంచి వచ్చినవారు. కోమట్లు, బలిజ నాయుళ్ళు, రెడ్లు, యాదవులు, నేత నేసే సాలివారు, బ్రాహ్మణులు మరియు ముతరాసులు చెప్పుకోదగిన సంఖ్యలో వుండినారు. క్రీ.శ. 1699 లో చెన్నపురిని సందర్శించిన థామస్ బౌరీ అనే ఆంగ్లేయ యాత్రికుడు చెన్నపురిని గురించి విశేషమైన వివరాలు సేకరించాడు. చెన్నపురి వాసుల్లో అధిక సంఖ్యాకులు గెంటు (తెలుగు) వారని, వారి తర్వాత మలబారీయులు (తమిళులు) కోటలో రెండవ స్థానికులని బౌరీ పేర్కొన్నాడు. నగర పాలనా వ్యవస్థలో ఆంగ్లేయులు తెలుగు వారినే అధికారులుగా నియమించేవారు. స్థానిక వ్యాపారులంతా దరిదాపులు తెలుగు వారే. కాని క్రింది శ్రేణులలో పని చేస్తుండిన అనియమితులైన వారు కొంతమంది తమిళులు. అధిక సంఖ్యాకులైన తెలుగు వారు తమిళ భాషలో సులువుగా వ్యవహరిస్తుండడం వల్ల వృత్తి, వ్యవస్థలలో కూడా తెలుగు - తమిళ వైరుధ్యమెంత మాత్రం లేకుండా పోయింది.

ధనికులైన వ్యాపారులంతా తెలుగు నాటి వారే. క్రీ.శ.1680 వ సం.లో ప్రముఖ చెన్నపురి వ్యాపారులందరూ కలిసి ఒక కూటమిగా ఏర్పడి ఐక్యోన్నత వ్యాపార సంస్థ (Joint Stock Company) ఒకటి ఏర్పాటు చేసుకొన్నారు. విదేశీ కంపెనీల తాకిడిలకు, ఒత్తిడులకు తట్టుకొని దేశీయ వ్యాపారాన్ని వీలైనంత వరకు కాపాడు కొనడమే ఈ సంస్థ ముఖ్యోద్దేశం.

> ఇప్పటి జనరల్
> ఆస్పత్రి ప్రాంతానికి
> ఒకప్పుడు నక్కల
> అడవిగా పేరు;
> ఆ రోజుల్లో నగర
> శ్రీమంతులు,
> కూలీలు
> తెలుగువారే;
> పొలాలు, ఇళ్లు అన్నీ
> మనవారివే;
> స్కూళ్లలోనూ
> తమిళం కంటే
> ముందు తెలుగే
> ప్రారంభమైంది!

> చెన్నపురిలో
> నెల్లూరీయుత
> ప్రొఫెసర్ అచ్చిరెడ్డి,
> ఎం.ఎ.పి.హెచ్.డి.

ఈ సంస్థలోని సభ్యులు కొందరు- దామర్ల పెద వెంకటాద్రి, ముత్తు వీరన్న, సూరా వెంకన్న, సూరా అరియప్ప శెట్టి, సూరా ముత్తుశెట్టి, పసుమర్తి కాశయ్య, పట్టికల బాల శెట్టి, పట్టికల రంగ శెట్టి, చిట్టి ప్రీతి ముఖ్యులు. 1716 వ సం.లో వామ హస్తపు కులాల వారికి ప్రాతి నిధ్యం వహించిన కలువాయి శెట్టి, కాళ హస్తి శెట్టి తదితరుల సాక్ష్యాధారాల ప్రకారం వృత్తుల వారిలో అధిక సంఖ్యాకులు వామ హస్తీయులని, పండితులలో అధిక సంఖ్యాకులు దక్షిణ హస్తీయులని తెలుస్తోంది. వీరి ఇంటిపేర్లను ఊర్ల పేర్లతో పోల్చి చూస్తే అధిక సంఖ్యాకుల పూర్వ నివాసాలు చెంగల్పట్టు, నెల్లూరు,

కొరవ 11 పేజీలో

# ఉప్పు ఏనీళ్లు త్రాగుతూ మంచినీటి పన్ను కట్టాలా?

మంచినీటి సరఫరా పథకం ద్వారా ఉప్పునీటిని ప్రజలకు సరఫరా చేస్తూ, ఆ పరిస్థితిని సరిదిద్దను చేతకాని అల్లూరు గ్రామ పంచాయితీ ప్రస్తుతం వున్న నీటి పన్నును రెండింతలు పెంచను రంగం సిద్ధం చేయడాన్ని విమర్శిస్తున్నారు. అల్లూరు గ్రామానికి ముచ్చటగా మూడు వాటర్ పంపు హౌస్‌ల ద్వారా నీరు సరఫరా అవుతున్నా ట్యాంక్ కెపాసిటీకి మించి కనెక్షన్లు ఇవ్వడం వల్ల వుదయం అరగంట, సాయంత్రం 15 నిమిషాలు మాత్రమే కుళాయిల్లో నీరు వస్తాయి. మూడు పంపు హౌస్‌ల్లో ఏదో ఒకటి ప్రతి దినం పనిచేయక మారాం చేయడం వల్ల ఉప్పునీళ్లు, మంచినీళ్లు మిక్స్ చేసిన జవ్వల నీళ్లు ప్రజలు త్రాగుతున్నారు. ఏళ్ల తరబడి ఎందరో నాయకులను వేడుకున్నా ఈ పరిస్థితి మారలేదు. పంచాయితీకి వస్తున్న ఆదాయం చాలడం లేదని, అందువల్ల మూడు నెలల కొక సారి వసూలు చేసే నీటి పన్నును 18 రూపాయల నుండి 30 కు పెంచాలని కొత్త కార్య నిర్వహణాధికారి రంగం సిద్ధం చేసుకొన్నట్లు తెలుస్తోంది. నెల్లూరు వంటి మునిసిపాలిటీల్లోనే ప్రతి దినం నాలుగు గంటల పాటు నీటిని సరఫరా చేస్తూ నెలకు పది రూపాయలు మాత్రమే పన్ను వసూలు చేస్తున్నారు.

## జిల్లా వార్తలు

అల్లూరులో సక్రమంగా నీరు రావు; దానికి తోడు ఉప్పునీళ్లు కూడా. పంచాయితీ ప్రతి పక్షం చేతిలో వుంది; అధికార పక్షం వారు ఏం చేస్తున్నారో అర్థం కావడం లేదు. ప్రజలే వుద్యమిస్తే గాని నీటి పన్ను తగ్గేటట్టు లేదు!

### సూళ్లూరుపేట మార్కెట్‌లో తూకాల్లో మోసం

సూళ్లూరుపేట కూరగాయల మార్కెట్‌లో ఏది కొనబోయినా రేటు ఎక్కువ, బయట వచ్చి తూకం చూసు కుంటే బరువు తక్కువగా వుంటున్నాయని ప్రజలు లబో దిబో మంటున్నారు. అరకిలో కూరగాయలకు ఉచితంగా వంద గ్రాములు తగ్గిపోతున్నాయట. కూరగాయలు దీసు త్రాసులో పెట్టి పెట్టగానే వ్యాపారస్తుల హస్త లాఘవంతో బరువుకు భూమిని తాకు తుంటాయట. ఎవరైనా నోరు తెరిస్తే కొసరు వేసి సర్దటం మామూలై

కొరవ 7 పేజీలో



## బిజెపి సభలకు ఎంత దుర్గతి పట్టింది?

# సినిమా హోల్ ముందు కూడా జనం చాలా వెల్తి పడ్డారు!

7తేది బి.జె.పి. నర్తకి సినిమా హాలు సెంటర్‌లో జరిపిన బహిరంగ సభ, అంతకు ముందు నిర్వహించిన ప్రదర్శన తగిన జన స్పందన లేక వెల వెల బోయాయి. క్రమశిక్షణకు మారు పేరైన పార్టీ ప్రదర్శనలో ఈలలు, కేకలు వేస్తూ, గెంతులు వేయ నారంభించిన అల్లరి మూకలను అదుపు చేయలేక నాయకులు తలలు బాదుకున్నారు. సినిమా హాళ్లన్నీ వదిలే సమయంలో సభ మొద లెట్టినా పార్టీ కార్యకర్తలు తప్ప ప్రజలు నిలబడలేదు. రోడ్డు కూడా వెల్తిగా కన్పడింది. వెంకయ్య నాయుడు మాట్లాడడం మొదలు పెట్టాక రోడ్లో బాతాఖానీ కొట్టే సాయం విహారార్థులు గూమికూడి పరువు దక్కించారు. ముందుగా ప్రచారం చేసిన వక్తలలో పార్టీ యువ మోర్చా జాతీయ అధ్యక్షురాలు, సెన్సేషనల్ సన్యాసిని ఉమాభారతి సభకు రాలేదు. వెంకయ్య నాయుడు గారు మాత్రం గుక్క త్రిప్పకుండా అనర్గళంగా అక్క డక్కడా ఛలోక్తులతో 'డంకెల్ ప్రతిపాదనలు-తాజా రాజకీయ పరిస్థితులపై' మాట్లాడారు. సభకు పార్టీ జిల్లా అధ్యక్షులు డాక్టర్ వరదయ్య అధ్యక్షత వహించారు.

వెంకయ్య నాయుడు ప్రసంగిస్తూ కాంగ్రెస్ పార్టీ మంత్రులు, ఎమ్పీలు, ఎమ్మెల్యేలకు 'డంకెల్' అనేది మనిషో, జంతువో తెలియదు. కొత్త ప్రతిపాదనలను పార్లమెంటులో చర్చకు పెట్టకుండా దేశంలోని అసెంబ్లీలలో ప్రస్తావించ కుండా ప్రధాని పి.వి. నరసింహారావు ఒప్పందం కుదుర్చుకుని దేశానికి తీరని అన్యాయం చేశాడు. ఒకప్పుడు భారత దేశానికి ఈస్టిండియా కంపెనీ వాళ్లు వ్యాపారం చేసుకుంటామని భుజాన సంచి వేసుకొని వచ్చి 200 ఏళ్లు

## నెల్లూరు సంగతులు

మనల్నిబానిసలుగా మార్చి పరిపాలించారు. మళ్లీ వారేడంకెల్ ప్రతిపాదనలు అడ్డం పెట్టుకొని వస్తున్నారు. ఈ సారి ఏం చేసి వెళతారో నన్న సందేహాన్ని వ్యక్తం చేశాడాయన. నెల్లూరులో పండించిన ధాన్యాన్ని మద్రాస్‌లో అమ్ముకోను గతిలేదు. అమెరికాలో అమ్ముకోగలమా? అప్పటికే మన రాష్ట్రంలో ధాన్యం రేటు తక్కువ

కొరవ 8 పేజీలో

# వెంకటగిరి పోలీసులా- అచ్చోసిన ఆంబోతులా?

ముందే 'ఖాకీ' లు వారు, దానికి తోడు ఫుల్‌గా మందు కూడా కొట్టారు; ఇక చెప్పాలా వారి వీరంగం గూర్చి. వెంకటగిరిలో 4 తేది పోలీస్ స్టేషన్ ప్రక్కనే కాశీపేట సెంటర్‌లో జరిగిందీ సంఘటన. అప్పటికి రెండు గంటలకు ముందే జిల్లా ఎస్.పి శ్రీ రమణమూర్తి స్టేషన్‌ను తనిఖీ చేసి నెల్లూరు బయలు దేరారు. అంతవరకు నరాలు బిగ బట్టుకొని వున్న మందు ప్రియులైన జీపు డ్రైవర్ రమేష్, మరో కానిస్టేబిల్ వెంకటేశ్వర్లు సెంటర్ కొచ్చి మస్తుగా త్రాగేశారు. బజారులో తీసివున్న బడ్డీ బంకు లన్నీ మూసేయమని కేకలు పెట్ట నారంభించారు. వీరి కేకలకు భయపడి బంకులన్నింటినీ మూసి పారేశారు. అప్పుడే సిగరెట్ కోసం అవైపుకు వచ్చిన చెంచయ్య అనే వ్యక్తిని పట్టుకొని క్రింద పడవేసి మరీ కొట్టారు. ప్రాణం పోతుందని ఆ వ్యక్తి కాళ్లు పట్టుకున్నా, బస్సుల కోసం అక్కడ నిలబడ్డ ప్రజలు అడ్డం తీయబోయినా వాళ్లను సైతం తిట్టి మరీ చెంచయ్యను కొట్టారీ ఘనులు. అంతకు మునుపే బ్రాందీషాపు నుండి వస్తూ ఓ డ్రైవర్‌ను కూడా తుక్కు తుక్కుగా కొట్టారట. తదుపరి వానర కిష్కింధ ఘట్టంలా రోడ్డు వారగా దుకాణం వరండాల్లో వెలుగుతున్న లైట్లన్నింటినీ గంటకు పైగా దుడ్డు కర్రలు తీసుకొని పగల గొట్టారట. పోలీసులు చేస్తున్న ఘన కార్యాన్ని పలువురు పోలీస్ స్టేషన్‌కు వెళ్లి చెప్పినా ప్రయోజనం లేక పోయిందని ప్రత్యక్ష సాక్షులు చెప్పారు. ఇంతలో సి.ఐ. పేరయ్య ఆ వైపు వచ్చేసరికి ప్రక్క సందులోకి పారిపోయారు ఈ ప్రబుద్ధులు. ఆయన మాత్రం తక్కువ తిన్నారా; పోలీసులు తాగి గలభా చేస్తే చూస్తారా అని ప్రజలపై లాఠీ ఝుళిపించి మరీ ముందుకు సాగారట. క్రమశిక్షణకు భంగం కల్గిస్తున్న కానిస్టేబిళ్ల పై కొత్త ఎస్.పి. గారుప్రస్తుతం కత్తి కట్టి వున్నారు. మరి వీళ్లనేం చేస్తారో వేచి చూడాలి. ప్రతి సాంయంత్రం డ్రస్ వేసుకొని బ్రాందీ షాపుల ముందు ఎంగిలి మందుకోసం ఖాకీలను నిలబడ కుండా చేస్తే మీరు చెప్పిన 'ముందు జాగ్రత్తల చిట్కా' ప్రకారం గౌరవ ముంటవు ఎస్.పి. గారూ!

> ఎస్‌పి గారూ -
> బ్రాందీ అంగళ్ల
> ముందు మందు
> నీళ్లు అడుక్కునే
> ఖాకీలపైనా కన్నెర్ర
> చేయాలి!

### ముదివర్తిలో రిపబ్లిక్ దినోత్సవం

ముదివర్తి వున్నత పాఠశాలలో రిపబ్లిక్ దినోత్సవ వేడుకలు ఘనంగా జరిగాయి. పెద్ద సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్న పెరేడ్‌లో ప్రధానో పాధ్యాయుడు ఓ. బాల సుబ్రహ్మణ్యం జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు.

# మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్ ఏజెన్సీస్

## స్వర్ణోత్సవ చరిత్ర

మెసర్స్ ఆల్కలి ఇన్‌డస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్స్ లిమిటెడ్ కంపెని 1944 మార్చి 1 వ తేదిన ఏర్పడెను. శేషాయి బ్రదర్స్ గ్రూపులో చిన్నదైన ఈ కంపెని వ్యాపారం చేయు చుండెను. గ్యానిస్ మరియు తనికర్లి లిమిటెడ్ మరియు సదరన్ వృక్షస్ లిమిటెడ్ కంపెనీలకు అధ్యక్షులుగా వుండిన టి.కె. యస్. రంగనాథన్, తమ పలుకు బడిని వుపయోగించి ప్రముఖ అడివక్త టి.కె. శ్రీనివాస అయ్యంగారి కుమారుడైన టి.కె.యస్ పార్థసారథి గారిచే పెట్టుబడి పెట్టించి కలకత్తా వాస్తవ్యులైన శ్రీ దయారామ్ పోద్దర్ వారి మెట్టూరు కెమికల్ అండ్ ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్ కంపెనీని కొనిరి. అందుకు కృతజ్ఞతగా మెసర్స్ శేషాయి బ్రదర్స్ వారికి పూర్తిగా విక్రయించి ఏ జెన్సి ఇచ్చిరి.

తరువాత మెసర్స్ ఆల్కలి ఇండస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్స్ అనే పబ్లిక్ లిమిటెడ్ కంపెనీని స్థాపించిరి. ఈ కంపెనీకి టి.కె. యస్. రంగనాథన్, టి.కె. శేషాయి, టి.కె. పార్థసారథి, బెంగుళూరు పారిశ్రామిక వేత్త శ్రీ యస్. యమ్. రామకృష్ణారావు గార్లు డైరెక్టర్లుగాను టి.కె. గోపాలకృష్ణగారు మేనేజింగ్ డైరెక్టరుగారు ఏర్పడిరి. ఈ కంపెనీకి, మూడు లక్షల పెట్టుబడి దేశమంతటిలో 300 భాగ స్వాములు వుండిరి.

రోజుకు 5 మెట్రిక్ టన్నులు ఉత్పత్తి చేసే కాస్టిక్ సోడా యూనిట్‌ను కలకత్తా వాస్తవ్యులైన శ్రీ దయారామ్ పోద్దర్ మెట్టూర్ డామ్ వద్ద స్థాపించెను. మెసర్స్ ఐ.సి.ఐ లిమిటెడ్ మున్నగు అనేక అంతర్ జాతీయ కంపెనీలు ఇతర దేశాలనుండి సరుకు తెప్పించి తక్కువ ధరలకు విక్రయించుటచే, కాస్టిక్ సోడా యూనిట్‌ను నిర్వహింప లేక పోయెను. ఈ యూనిట్‌ను శేషాయి బ్రదర్స్ కొని అనతి కాలములోనే 200 టన్నుల ఉత్పత్తిని సాధించిరి. మెసర్స్ ఆల్కలిఇన్‌డస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్స్ వారు వ్యాపారమును బాగుగ చేయు చుండిరి. కాని అజమాయిషి సరిగా లేనందు వలన నష్టము వచ్చెను. ఈ దశలో మెట్టూరు కెమికల్ అండ్ ఇన్‌డస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ కె.కె. రామ్ దీనిని స్వాధీనము చేసుకొని తన cost Accountant ను నియమించెను. మెసర్స్ అల్యూమినియమ్ ఇండస్ట్రీస్ ఏజెన్సీని దానికి ఇచ్చి మరల దానిని మంచి పరిస్థితికి తీసుకొని వచ్చెను. 1959 లో శ్రీ వి. శేషాయి మరణించిరి. మెసర్స్ శేషాయి పేపర్ అండ్ బోర్డ్స్, మెసర్స్ శేషాయి ఇండస్ట్రీస్ లిమిటెడ్, మెసర్స్ నైవేలి సిరామిక్స్ వారు ఈ కంపెని నుండి విడిపోయి, వారి స్వంత వ్యాపారములను ప్రారంభించిరి.

శ్రీ ఇ. యస్. రెడ్డి 1960 నవంబరు 15 తేదిన కార్య నిర్వాహకుడిగను 1961 మేనెలలో మేనేజర్ గాను 1963 లో మేనేజింగ్ డైరెక్టరుగా ఉన్నత పదవిని పొందిరి.

ఇ. ఎస్ రెడ్డి గారు ఎక్కువ షేర్లుకొని, 29-4-67 లో భాగస్వామ్య కంపెనీగా మార్చిరి. ఈ కొత్త కంపెనీయే మదరాసు ఇండస్ట్రియల్ కెమికల్ ఏజెన్సీస్ ఈ కంపెనీలో శ్రీ యస్.యమ్ రామకృష్ణరావు, శ్రీ యన్ కృష్ణన్ ( కలకత్తాలో మెట్టూర్ కెమికల్స్‌కు పంపిణీ దారు ) శ్రీ హెచ్.వి. సోమయ్య (మెట్టూర్ కెమికల్ & ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్‌కు బొంబాయిలో పంపిణీదారు) భాగస్తులు. వీరుగాక శ్రీ ఇ. యస్. రెడ్డి కుటుంబమువారు భాగస్తులైరి. శ్రీ ఇ.యస్. రెడ్డి జనరల్ మేనేజరయ్యెను. అతి కొద్ది కాలంలోనే ఈ కంపెని సీతారామ రెడ్డిగారి కుటుంబంనకు చెందింది. ప్రారంభ దశలో ఫాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ యమ్. కె.కె. నాయర్, ఇ.ఐ. యస్. మెట్టూర్ కెమికల్స్‌కు మేనేజింగ్ డైరెక్టరైన శ్రీ ఆర్.వి.రమణి, టి.సి.సి. మేనేజింగ్ డైరెక్టరైన శ్రీ మల మత్తూర్ రామకృష్ణ ఐ.ఏ.ఎస్. ఎంతో సహాయము చేసిరి. పరిశ్రమ, పట్టుదల నీతి నిజాయితీతో ఈ కంపెని అగ్రశ్రేణి వ్యాపార సంస్థ లలో ఒకటిగా ప్రసిద్ధి చెందెను. నగరములో ప్రసిద్ధి పొందిన పంపిణీ దార్లలో ఒకటిగా పరిగణింపబడెను. అంతేగాక నగర సమీప జిల్లాలలో క్రింద కనపరచిన ఉత్పత్తి దారులలోను ఈ వ్యాపార సంస్థ ప్రముఖ పంపిణీ దారుగా వున్నది.

1. మెసర్స్ కెమికల్స్ అండ్ ప్లాస్టిక్స్ ఇండియా లిమిటెడ్.
2. మెసర్స్ గుజరాత్ హెవి కెమికల్స్ లిమిటెడ్
3. మెసర్స్ అమర్ డైకెమ్ లిమిటెడ్
4. మెసర్స్ అమృత లాల్ కెమాక్స్ లిమిటెడ్
5. మెసర్స్ హిక్సన్ అండ్ దాదాజీ లిమిటెడ్
6. మెసర్స్ కలర్ కెమ్ లిమిటెడ్
7. మెసర్స్ డై-ఇచ్చి కార్ కేరియా లిమిటెడ్
8. మెసర్స్ అమోనియా మార్కెటింగ్ కంపెని.

దీని శాఖలు విజయవాడ, సేలమ్, తిరుపూర్, ఈరోడ్ మరియు పాండిచ్చేరి లలో స్థాపింప బడినవి.

కెమికల్స్ అండ్ ప్లాస్టిక్స్ ఇండియా లిమిటెడ్ అధ్యక్షులైన శ్రీ కె.యస్. నారాయన్ గారు ఇతర కార్య నిర్వాహకులు, పైగా పంపిణీ దారుగా వున్న కంపెనీల యొక్క అండదండలు సదా కొన సాగ గలవని ఈ సంస్థ ఆశించుచున్నది.

" వ్యాపారస్తులు సొమ్మును జాగ్రత్త జేసి, తమ ఉద్యోగుల సంక్షేమం, సమాజ సాంఘిక అవసరములకు వెచ్చింప వలెనని" జాతిపిత శ్రీ మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీగారు సూచించిరి. వారి సూత్రము లందు మాకు విశ్వాసములు కలవు. వారి సూత్రాను సారము, మేము ఆస్పత్రులకు , పాఠశాలలకు , ప్రజోపయోగ కార్యకలాపములకు భూరి విరాళములను ఒసంగు చున్నాము.

- ఏనుగ సీతారామిరెడ్డి
మేనేజింగ్ డైరెక్టర్.

# నెల్లూరు రచ్చల్లో

## విమర్శకుడు

### జనార్ధన రెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ ఎన్. జనార్ధన రెడ్డిని ఒక్క పూట హైదరాబాదులో నిలువ నివ్వడం లేదం ప్రధాని. పరిశీలనలు, నివేదికల పేరిట ఢిల్లీలోనే కూర్చో బెట్టేస్తున్నారు. 7 తేది హైదరాబాదు వచ్చారు; ప్రక్కరోజే ఢిల్లీ నుంచి అర్జెంట్ మెసేజ్ వచ్చింది; 9 తేది తిరిగి వెళ్లిపోయారు. బహుశా 16 తేది హైదరాబాదుకు రావచ్చు. 20 తేది నుంచి వారం రోజుల పాటు నెల్లూరు జిల్లాలో పర్యటించే ఉద్దేశ్యం వున్నట్లుంది. కార్యక్రమం ఇంకా ఖరారు కాలేదు.

### మంత్రులు

దేముళ్ల మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి 7 తేది నెల్లూరు వచ్చారు; 13 తేది వరకు కావలిలో వుంటారు. ఇళ్ల మంత్రి పసల పెంచలయ్య 13 తేది రావచ్చు.

సహకార మంత్రి శ్రీ చెంగారెడ్డి 10 తేది ఉదయం గూడూరులో రైలు దిగి, పుత్తూరుకు కారులో వెళ్లారు.

### గవర్నర్ రఘునాథ రెడ్డి

పశ్చిమ బెంగాల్ గవర్నర్ శ్రీ కె.వి. రఘునాథ రెడ్డి 17 తేది నెల్లూరు వస్తున్నారు. 18, 19 తేదులలో ఇక్కడ కొన్ని కార్యక్రమాలలో పాల్గొంటారు. 19 తేది రాత్రి మెయిల్‌లో కలకత్తా తిరిగి వెళ్తారు.

రఘునాథ రెడ్డి గారు నెల్లూరు వచ్చి చాలా కాలమైంది. త్రిపుర గవర్నర్‌గా వున్నప్పుడు కాబోలు ఒకసారి వచ్చారు. ఆయన నెల్లూరీయుడని పేరే కాని, ఎరు వంటి ఒకరిద్దరితో తప్ప నెల్లూరుతో సంబంధాలే లేవు. జనంతో సంబంధం లేకుండా, జనం మధ్య తిరగ కుండా, జనానికి దొరక కుండా చిరకాలం ఉన్నత రాజకీయ పదవులు అనుభవించ గల్గిన అదృష్టం రఘునాథ రెడ్డి గారికే దక్కింది. అయితే తన సుదీర్ఘ పదవి రాజకీయాలలో, లేదా ప్రజా జీవితంలో పుట్టిన వూరుకు కాని, జిల్లాకు కాని, రాష్ట్రానికి కాని చేసిన ఉపకారం అంటూ ఏమైనా వుందేమో వెతకడం దుర్లభం. సోషలిస్టు సిద్ధాంతాలపై అనుపమాన మైన అవగాహన, అధ్యయనం, మక్కువ కల్గిన మేధావిగా మాత్రం ఆయనకు దేశ వ్యాప్త మన్నన వుంది. రఘునాథ రెడ్డి గారికి కాంగ్రెస్ ప్రభుత్వాలలో విడవకుండా పదవులు లభించడం విశేషం.

### సతీష్ చంద్ర సరికొత్త వివాదం

జాయింట్ కలెక్టర్ శ్రీ సతీష చంద్రకు రెవిన్యూ ఉద్యోగులతో సరిక్రొత్త వివాదం వచ్చింది. ఈసారి ఎమ్మార్వోలపై కత్తి ఝుళిపించారు. హెడ్ క్వార్టర్స్‌లో కాపురం వుండని ఇందుకూరు పేట, తోటపల్లి గూడూరు, ముత్తుకూరు, పొదలకూరు, అనంత సాగరం ఎమ్మార్వోలకు జనవరి నుంచి ఇంటి అద్దె అలవెన్సు రద్దు చేశారు. దీనిపై అలజడి రేగుతున్నది.

ఒక రకంగా జెసిగారు చేసింది మంచి పనే! మండలాలు వచ్చిన తర్వాత ప్రభుత్వోద్యోగులు టౌన్లలో కాపురాలు పెట్టి, సీజన్ టిక్కెట్ల పై వెళ్లి రావడం మామూలై పోయింది. బస్సు లేదా రైళ్ల వేళలకు అనుకూలంగా వుంటుంది వారు ఆఫీసులో డ్యూటీ చేసే సమయం. బస్సు ఆలస్యమైతే ఆఫీసుకూ ఆలస్యమే. సాయంత్రం బస్ మీద తప్ప పనిమీద దృష్టి వుండదు. ఎమ్మార్వో వంటి బాధ్యతా యుతమైన విధి నిర్వహణలో వున్నవారూ అదే దరువుకు మళ్లుకుంటే ఇక వారి క్రింద పనిచేసే వారు ఎట్లా మాట వింటారు? ఆటెండరు, ఎమ్మార్వో ఒకే బస్‌లో ప్రక్క ప్రక్కన కూర్చుని రోజూ ప్రయాణం చేస్తూ ఆఫీసుకు వస్తుంటే ఏ పదవికైనా విలువెట్లా వస్తుంది? నెల్లూరులో కాపురాలు చేస్తూ, గ్రామాలలో హెచ్ఆర్ఏలు డ్రా చేయడమేమిటి? వత్తిడులకు తట్టుకుని నిలుస్తాడో లేక వంగిపోయి ఉత్తర్వు వెనక్కు తీసుకుంటాడో తెలియదు కాని, జెసి చేసింది మాత్రం మంచి పనే!

### ఎస్పి గారు సెబాషన్పించారు!

నెల్లూరు పోలీసు సూపరింటెండెంట్ శ్రీ రమణమూర్తి ఇక్కడ నియమితు లైనప్పుడు ఆయన గురించి విన వచ్చిన వార్తలకు, ఇప్పుడు మనం చూస్తున్న ఆయన పని తీరుకు చాలా వ్యత్యాసం కన్పిస్తోంది. విధి నిర్వహణలో చాలా నిక్కచ్చిగా, కఠినంగా వ్యవహరిస్తున్నారాయన.

డైలీ లాటరీల విషయంలో ఎస్పి గారి కఠిన ధనం అందరి ప్రశంసలూ పొందుతూంది. ఒక్క లాటరీ అంగడి కన్పడకుండా చేశారు. ఆ వ్యాపారులతో లాలూచీ పడినట్లు తెలిసిన కానిస్టేబుళ్లను సస్పెండ్ చేశారు. ఒకరిద్దరు ఎస్ఐల పై దర్యాప్తుకు కూడా ఆదేశించినట్లు రహస్య వర్తమానం. టౌన్ డిఎస్పి శ్రీ లక్ష్మిరెడ్డి ఆయనకీ విషయంలో పూర్తి మద్ధతు నిస్తున్నట్లున్నారు.

రాష్ట్రంలో డైలీ లాటరీలను సమర్థవంతంగా అదుపుచేసి, అమాయ కులు, ఆత్యాశపరుల జీవితాలను కాపాడిన ఘనత ఈ ఇద్దరు అధికారులకే లభిస్తుంది. విజయవాడ, గుంటూరు, రాజమండ్రి, వంటి పట్టణాలలో డైలీ లాటరీ మహమ్మారి వికృతంగా కన్పిస్తున్నది. నెల్లూరులో మాత్రం దాన్ని తరిమేశారు. కోర్టులు, స్టేఆర్డర్లు, ఒత్తిడుల ప్రలోభాలను తట్టుకొని ఆ భూతాన్ని నిర్దాక్షిణ్యంగా అణచి వేసిన ఎస్పి గారిని అందరూ సెబాసంటున్నారు.

### జైలు బదలీ

నెల్లూరు జిల్లా జైలు సూపరింటెండెంట్ శ్రీ జె. రాజారావును వరంగల్‌కు బదలీ చేశారు. ఇక్కడ ఇంకా ఎవర్నీ నియమించ లేదు.

రాజారావు గారు ఖైదీలతో కూడా స్నేహ పాత్రంగా గడిపేటంతటి సౌమ్యుడు. జైలు అంటే ఏదో భయంకర ప్రదేశం అన్న దురభిప్రాయం ప్రజలలో తొలగించి, ఖైదీలూ మన వంటి పౌరులే నన్న

కొరవ 7 పేజీలో

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ)

పోయిందని గగ్గోలు. తూనికల కొలతల శాఖాధికార్లకు మార్కెట్ వైపు పోను తీరికలేని విధంగా నెంచుల నిండా పనికి చేరుతుంటాయి! జిక ప్రజల ఆకలన్నీ వినియోగదార్ల సంఘ సమ్మేళనపైనే; తప్పుడు బరువులు తెగ తూచే త్రాసులు వీటికి తల వంచుతాయంటారా?

### నేత్రదానం చేసిన అపూర్వ దంపతులు

మనుషులు పైకి పాత తరానికి చెందవచ్చు; వారి మనసులు మాత్రం మమతానురాగాలు నిండి మానవత్వం పంచేవి. ఈ అపూర్వ దంపతులే గూడూరు రామకృష్ణయ్య(85) కృష్ణవేణమ్మ(78) మరణానికి ముందే నేత్ర దానానికి వీరిద్దరూ సంసిద్ధత వ్యక్తపరిచి వుండినారు. 93 డిసెంబర్ చివరి వారంలో రామకృష్ణయ్య అకస్మాత్తుగా దివికి చేరారు. కృష్ణవేణమ్మ తన భర్త నేత్రాలను గూడూరు నేత్ర దాతల సంస్థకు అందజేసి, తన భర్త మాటను నిలబెట్టారు. తన భర్త వియోగం భరించలేని ఆమె జనవరి 30తేది పరమ పదించారు. ఆమె నేత్రాలను కూడా కుటుంబ సభ్యుల ప్రోత్సాహంతో సేకరించి మద్రాస్ అగర్వాల్ కంటి పరిశోధనా శాలకు పంపినట్లు సంస్థ కార్యదర్శి పి. రాజారాం రెడ్డి తెలియ జేస్తున్నారు.

### రాపూరులో తరచూ కరెంట్ కోత

రాపూరులో ఎండాకాలం రాక మునుపే ప్రతిదినం ఎనిమిది గంటల పాటు అనధికార కరెంట్ కోత విధిస్తున్నారని ప్రజలు గగ్గోలు పెడుతున్నారు. ఉదయం 6 నుండి 10వరకు, మధ్యాహ్నం 12 నుండి 3 గంటల లోపు, సాయంత్రం 4-6, రాత్రి 8-1 గంటల మధ్య ఈ తంతు కొనసాగుతున్నదట. ఎవరైనా అడిగితే గూడూరులోని మెయిన్‌లైన్ లోనే ఫాల్ట్ అని సిబ్బంది సమాధాన మిస్తున్నారట. గతంలో కూడా ఈ విధానాన్ని సిబ్బంది అనుసరించడం, ప్రజలు ధర్నాకు పూను కొనడం, పరిస్థితి చక్క బడడం జరిగిందట. రాపూరు ప్రజలు మళ్లీ 'ధర్నా' చేయక తప్పదంటారా ఏ.ఇ గారూ?

### పాటూరులో సిటిజన్స్ నేత్ర చికిత్సా శిబిరం

నెల్లూరు సిటిజన్స్ క్లబ్, లైన్స్‌క్లబ్ పాటూరు గ్రామంలో సంయుక్తంగా ఉచిత నేత్ర చికిత్సా శిబిరాన్ని విజయవంతంగా నిర్వహించాయి. జడ్‌పిపి హైస్కూలులో శిబిరాన్ని 2తేది సర్వేపల్లి ఎమ్మెల్యే ప్రభుత్వ విప్ సి.వి. శేషారెడ్డి ప్రారంభించారు. ఆరోజే 700 మందికి కంటి పరీక్షలు నిర్వహించి వుచితంగా మందులు పంచి పెట్టారు. పరీక్షకు వచ్చిన వారిలో 101 మంది ఆపరేషన్‌కు అర్హులని నిర్ణయించి కర్నూల్ నుండి ప్రత్యేకంగా తరలి వచ్చిన డాక్టర్ల బృందం ఆపరేషన్లు జయప్రదంగా నిర్వహించింది. 6 తేది జరిగిన ముగింపు సమావేశంలో లైన్స్ డిస్ట్రిక్ట్ గవర్నర్ డి. అంకినీడు పాల్గొని ఆపరేషన్ చేయించుకున్న వారికి కళ్లద్దాలు పంచి పెట్టారు ఈ కార్యక్రమంలో పాటూరు ప్రముఖులు సామంతు రఘురామిరెడ్డి, చిట్టమూరు రఘురామిరెడ్డిలతో పాటు సిటిజన్స్ క్లబ్ అధ్యక్షుడు ఐ. ఉదయ భాస్కర్ రావు కూడా పాల్గొన్నారు.

### కృష్ణపట్నం రేవు-మంత్రిహామి!

సర్వేపల్లి ఎమ్మెల్యే ప్రభుత్వ విప్ సి.వి.శేషారెడ్డి నియోజక వర్గాన్ని హైదరాబాద్ నుండి నెల్లూరు వచ్చి సందర్శించ కుండా పోయిన మంత్రి లేడని చెప్పవచ్చు. ఏదో ఒక విధంగా ఎక్కడో ఒక చోట చిన్న కార్యక్రమమైనా ఏర్పాటు చేసి మంత్రులను అక్కడకు తీసుక వెళ్లి సమస్యల చిట్టా చదివి పరిష్కారానికి తెలివిగా మార్గం సుగమం చేస్తుంటాడు సి.వి. 3 తేది సుబ్బారెడ్డి పాళెం గాదెల వాగుపై కట్టిన వంతెన ప్రారంభోత్సవానికి రోడ్లు భవనాలు, ఓడరేవుల మంత్రి టి. పురుషోత్తమ రావును ఆహ్వానించిన కార్యక్రమం ఇటు వంటిదే. సభలో కృష్ణపట్నం ఓడరేవులోని కష్టాలను గూర్చి సి.వి. ప్రస్తావించి గమ్మున కూర్చున్నారు. మంత్రిగారు స్వయంగా రేవు సందర్శనకు 'సై' అని బయలు దేరారు. స్వాతంత్ర్యం వచ్చాక సమర్థవంతంగా పని చేస్తుండిన రేవులు ఎందుకు పనికి రాకుండా పోయాయో అర్థం కావడం లేదు. అన్ని అనుకూలతలే వున్న కృష్ణపట్నం రేవు అభివృద్ధి పరచి తీరుతానని మంత్రి హామీ ఇచ్చారు. సివి కోరిక మేరకు ముత్తుకూరు - వెంకటాచలం రోడ్డును జాతీయ రహదారిలో కలిపే విషయం కూడా పరిశీలిస్తానన్నారు. పర్యటనలో మంత్రి వెంట ఎస్.ఎఫ్.సి ఛైర్మన్ ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ సుందరరామి రెడ్డి, గూడూరు ఎమ్మెల్యే పత్రా ప్రకాశరావు, సెంట్రల్ బ్యాంక్ అధ్యక్షులు వేమారెడ్డి రామచంద్రారెడ్డి, మాజీ మండలాధ్యక్షులు వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి తదితరులు వున్నారు.

### నెల్లూరు ముచ్చట్లు

(6 పేజీ కొరవ)

సాన్నిహిత్య భావం పెంపొందించడానికి జైలు లోపల తరచూ ఏదో ఒక కార్యక్రమం నిర్వహించేవాడు. ఖైదీలకు పలు సౌకర్యాలూ కల్పించాడు. నెల్లూరు జైలును స్పెషల్‌గ్రేడ్‌గా పెంపొందింప చేసింది రంబారావు గారే!

### లయన్స్ గవర్నర్

లయన్స్ క్లబ్ డిస్ట్రిక్ట్ గవర్నర్ శ్రీ డి. అంకినీడు 7తేది నెల్లూరు వచ్చి వెళ్లారు. షాదీ మంజిల్‌లో లైన్స్ క్లబ్ నిర్వహించిన నేత్ర చికిత్సా శిబిరం ప్రారంభించారు. వాత్సల్య అనాథ శరణాలయంలో పిల్లలకు టవల్స్ పంచి పెట్టారు; మదర్ థెరిస్సా హోంలో భోజనం వడ్డించారు; లయన్ లేడీస్ నిర్వహించే కుట్టు పాఠశాల సందర్శించారు. పాటూరు నేత్ర శిబిరం ముగింపు సభలో మాట్లాడారు. ఒకే సమయంలో మూడు నేత్ర చికిత్స శిబిరాలు నిర్వహించిన నెల్లూరు లయన్స్ క్లబ్ అధ్యక్షుడు శ్రీ ఎస్ఎన్‌వి రామోహన్‌రావు, కార్యదర్శి డాక్టర్ జయచంద్ర, ఐ క్యాంప్ అధ్యక్షుడు, స్టీరియో సౌండ్స్ ఆంజనేయులు లను అభినందించారు.

### స్త్రీని తగుల బెట్టిన కిరాతక కానిస్టేబిల్

ఆత్మకూరు పోలీసు స్టేషన్ కానిస్టేబిల్ ఈశ్వరయ్య 5 తేది రాత్రి నెల్లూరు సంత పేటలో గోవిందమ్మ అనే మహిళను కిరోసిన్ పోసి తగల బెట్టాడు.

ఈశ్వరయ్యకు గోవిందమ్మకు చాలా కాలం నుంచి అక్రమ సంబంధం వుంది. ఆమె భర్త చని పోయినతర్వాత పిల్లలను బంధువుల ఇంట్లో వదిలేసి ఇతడి దగ్గరే వుంటుండేదట. కొన్ని రోజులు పొదలకూరులో కాపురం వెలగ బెట్టాడు. ఇటీవలే నెల్లూరుకు తెచ్చి పెట్టాడు. రోజూ త్రాగి వచ్చి కొట్టేవాడట. 5 తేది రాత్రి కామాటి వీధికి చెందిన ఒక కొత్త వ్యక్తిని తెచ్చి ఆమెకు తార్చబోయాడట. ఇద్దరి మధ్య ఏదో గొడవ జరిగినట్లుంది. త్రాగిన మైకంలో కోపం పట్టలేక ఆమె వంటిపై కిరోసిన్ పోసి నిప్పంటించాడు. చుట్టు ప్రక్కల వారు వచ్చి వెంటనే ఆస్పత్రిలో చేర్పించారు కాని, పాపమా మహిళ రాత్రంతా నరకం చవిచూసి 6 తేది మధ్యాహ్నం చనిపోయింది. ఈ కానిస్టేబిల్ స్వంత భార్య పిల్లలు మూలపేటలో వున్నారు.

### మరణం

సింగరాయకొండ తొలి సర్పంచ్, ఒంగోలు జిల్లా వాడైనా నెల్లూరు జిల్లాతో, నెల్లూరీయులతో నిత్య సంబంధాలు కలిగిన వైశ్య ప్రముఖుడు కోరమాండల్ సిమెంట్స్ స్థాపకుడు, విద్యా సంస్థల స్థాపన పట్ల మక్కువ కలిగిన విద్యాభిమాని శ్రీ శికాకొల్లు సుబ్బారావు 20 తేది మరణించారు. ఆయనకు ముగ్గురు కుమారులు.

### శివశంకర్

( మొదటి పేజీ కొరవ)

చేస్తాం'' అనడం ఆయనలో ఉరఉర పెంచింది

బహుజన సమాజ్ పార్టీ సభలకు జనం విరగబడి వచ్చినా, ఆ జనాదరణను వ్యవస్థీకృతం చేసే యంత్రాంగం, నాయకత్వం ఆ పార్టీకి లేవు. కత్తి పద్మారావు, సత్యమూర్తి వంటి వారు చేరినప్పటికీ వారికి ఆలోచన కంటే ఆవేశం ఎక్కువ. రక్తం ఉడికించే ఉపన్యాసాలు చేయగలరే కాని, రాష్ట్ర మంతటిలో వివిధ వర్గాలకు చెందిన వారిని కూడగట్టి, కలసి పనిచేసే విధంగా పార్టీని తీర్చిదిద్దే అనుభవం లేదు. ఈ శూన్యాన్ని తానైతే బాగా పూరించ గలనని శివశంకర్ విశ్వాసం. శివశంకర్ వంటి వెనుకబడిన తరగతులకు చెందిన వారు నాయకత్వం స్వీకరిస్తే బిఎస్‌పికి మంచి పూపు లభిస్తుందని భావిస్తున్నారు. గౌతు లచ్చన్న ఇప్పటికే ముందు వరుసలో వున్నా, ఆయన వృద్ధుడై పోయాడు. ఇప్పటి ఉడుకుమిడుకు రాజకీయ వాదులతో సహజీవనం ఆయనకు అసాధ్యం. ఈనాటి రాజకీయాల స్పీడును ఆయనందు కోలేదు. అందుకే శివశంకర్ ప్రకటన అంత ఉత్సుకతను కల్గిస్తున్నది.

అయితే శివశంకర్ నిజంగా కాంగ్రెస్ వదలి వెళ్తాడా లేక తనను అప్పటికైనా గుర్తించకుంటే వెళ్లిపోతాను జాగ్రత్త అని బెదరించ చూస్తున్నారా అన్నది సందేహం. దీనికి సమాధానం చెప్పగలవాడు శివశంకర్ ఒక్కడే!

### మన్మోహన్‌సింగ్

(2 పేజీ కొరవ)

పరిజ్ఞానం అవసరం హోటల్ చైన్లు, రెస్టారెంట్లు, చొక్కాలు, జీన్స్ ప్యాంట్‌లు, టూత్ పేస్టులు, సబ్బులు, సిగిరెట్ల వంటి పరిశ్రమలే వారిక్కడ స్థాపించ బోతున్నారు. ఒక వైపు చవకగా దిగుమతౌతున్న ఉన్నత సాంకేతిక వస్తువుల ధాటికి తలవంచి మన పరిశ్రమలు మూత పడుతుంటే - ఇంకొక ప్రక్క సాధారణ వస్తువుల తయారీలో విదేశీ కంపెనీలకు రాయితీలిచ్చి ఆ వర్గ పరిశ్రమలనూ దెబ్బ తీస్తున్నది ప్రభుత్వం. వెరసి పారిశ్రామిక రంగం తీవ్రమైన సంక్షోభంలోకి నెట్టబడ బోతున్నది. నిరుద్యోగ భూతం సరిహద్దులలోనే పొంచి వుంది.

చేపలు, రొయ్యలు, వజ్రాలు, పండ్లు, కూరగాయలు, పత్తి, పొగాకు, చర్మాలు, పప్పుదినుసులు వంటి వ్యవసాయోత్పత్తులు, సాంప్రదాయక వస్తువులు ఎగుమతులే మన విదేశీ మారక ద్రవ్య నిల్వలను పెంచుతున్నాయి తప్ప, ఇంజనీరింగ్ పరికరాల వంటి ఎగుమతులు ఏ మాత్రం పెరగడం లేదు తరిగి పోతున్నాయి. బ్రిటీషు వలస పాలకుల కాలం నాటిలో వలె ముడి పదార్థాలు ఎగుమతి చేసి, తయారైన వస్తువుల దిగుమతి చేసుకోవలసిన దుర్గతి మనకు సంప్రాప్తించే ప్రమాదం కాచుకొని వుంది.

(ది వీక్, ఇండియా టుడే, ఎకనామిక్ టైమ్స్ వంటి పత్రికల ఆధారంగా)

## నెల్లూరు సంగతులు

(5 పేజీ కొరవ)

బియ్యం రేటు ఎక్కువ; పొగాకు రేటు తక్కువ సిగరెట్ ఎక్కువ; మిర్చి కొనుగోలు రేటు తక్కువ మిరప కాయలు మార్కెట్‌లో అమ్మకం రేటు ఎక్కువ; కొన బోతే కొరివి అమ్మబోతే అడవి రీతిలో వస్తువుల రేట్లున్నాయి. డంకెల్ ప్రతిపాదనల వల్ల వున్న వుద్యోగాలే వూడిపోతాయి. ప్రాణం నిలుపుకొనే మందుల రేట్లు నూటికి నూరు శాతం పెరిగి పోతాయి. రైతు పట్టా పొలం ఎందుకు కలిగి వున్నావా అని కృంగి పోక తప్పదని నాయుడు వివరించారు.

దేశ భక్తులైన అద్వానీ, జోషి, ఉమాభారతిలకు సంకెళ్లు వేసి షహాబుద్దీన్, సులేమాన్ సేట్లు, ఓవైసిలను పి.వి. నరసింహారావు ప్రభుత్వం సన్మానిస్తుంది. కాశ్మీర్‌పై ప్రభుత్వానికే సమగ్ర అవగాహన లేక పోవడం వల్ల పాకిస్తాన్ రెచ్చి పోతున్నది. ఈసారి ప్రపంచ పటం నుంచే పాకిస్తాన్ అదృశ్యమై పోయేట్లుగా భారత దేశం బుద్ధి చెప్పాలని సలహా యిచ్చారు. ఈసారి దేశంలో అన్ని పార్లమెంటు స్థానాలతో పాటు ఆంధ్ర ప్రదేశ్‌లో అన్ని అసెంబ్లీ స్థానాలకూ బిజెపి ఒంటరిగా పోటీ చేస్తుందని వెల్లడించారు.

అంతకు ముందు ప్రసంగించిన వారిలో బిజెపి మహిళా మోర్చా రాష్ట్ర అధ్యక్షురాలు శ్రీమతి శాంతారెడ్డి సభలో పట్టుమని రెండు వందలకు మించని మహిళల సంఖ్య గూర్చి గొప్పగా చెబుతూ ఇటీవల నెల్లూరులో నిర్వహించిన మహిళా సదస్సుకు ఇంత మంది కూడా రాలేదని ఒకప్పటి మిత్రపక్షమైన తెలుగు దేశంను ఎద్దేవా చేశారు. ప్రధాన కార్యదర్శి కె. రాంప్రసాద్, కార్యదర్శి హరిబాబు, యువ మోర్చా రాష్ట్ర కార్యదర్శి ప్రేమేందర్ రెడ్డి వేదికపై ఆశీనులయ్యారు.

### లవ్‌గేమ్ వీడియోచిత్రం షూటింగ్ పూర్తి

నెల్లూరు యువకుడు ఎ. అళహరి కథ, స్క్రీన్‌ప్లేలతో పాటు దర్శకత్వం వహించి తీసిన లవ్‌గేమ్ వీడియో చిత్రం షూటింగ్ ఇటీవల పూర్తయ్యింది. ఎడిటింగ్ , మిక్సింగ్, డబ్బింగ్ కార్యక్రమాలు ఫిబ్రవరి నెలాఖరుకు పూర్తి కావించి మార్చి నెలలో విడుదల చేస్తారట. టినేజ్ లో వుండే యువతి ముగ్గురు యువకుల జీవితంలో ప్రేమ పేరుతో తుఫాన్ రేపి, పెళ్లయాక ఎదుర్కొనే కష్టాలు, ... ప్రధాన అంశాలుగా కథ సాగుతుంది. ఇందులో నెల్లూరీయుడు మదీనా వాచ్ కంపెనీ అధినేత షేక్ ఇస్మాయిల్, రాజేంద్ర ప్రసాద్, వర్ధమాన సినీ నటి రమ్యభారతి, మైథిలి, లాస్య, అభినయ వివేక్, గజేంద్ర నటిస్తున్నారు. మాటలు నవలా రచయిత శైలకుమార్, సంగీతం జి. ఆనంద్ సమకూరుస్తున్నట్లు నిర్మాత ఎ. సత్యనారాయణ తెలిపారు.

### నెల్లూరులో వ్యవసాయ పశు ప్రదర్శన

జిల్లాలోని అన్ని శాఖలు సంయుక్తంగా కలసి నిర్వహిస్తున్న వ్యవసాయ, పశు ప్రదర్శనకు రైతులు, ప్రజల నుండి గత మూడేళ్లుగా అనూహ్య స్పందన లభిస్తుంది. దాన్ని దృష్టిలో వుంచుకొని ఎప్పుడూ నీరసంగా కన్పించే పశు సంవర్ధక శాఖ, వ్యవసాయ శాఖలు తమ మత్తు వదిలించు కొని హుషారు తెచ్చుకొని 12,13,14 తేదీల్లో వై.ఎం.సి చర్చి గ్రౌండును ముస్తాబు చేయడంలో నిమగ్నమై వున్నాయి. రైతుల కోసం వివిధ రకాల పంటలు, పండ్లు, కూరగాయలు, విత్తనాలు, ఎరువులు, ఆధునిక వ్యవసాయ పనిముట్లు, విజ్ఞాన విషయాలను ప్రదర్శిస్తారని పోటీలు కూడా నిర్వహిస్తారని జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివరావు తెలుపు తున్నారు. 12 తేది వుదయం 9.30కు సదస్సును దెముళ్ల మంత్రి కలికి యానాది రెడ్డి ప్రారంభిస్తారు. మధ్యాహ్నం పశుపోషణ, పాడి పరిశ్రమ, కోళ్ల పెంపకంపై కర్షక సదస్సు; సాయంత్రం గానా భజానా. 13 తేది పెంపుడు కుక్కల ప్రదర్శనకు ఇళ్ల మంత్రి పసల పెంచలయ్య రిబ్బన్ కట్ చేస్తారు చేపలు, రొయ్యల పెంపకంపై సదస్సు. మధ్యాహ్నం పట్టు పరిశ్రమ, అటవీ సంపదలపై రైతు సదస్సు. 14 తేది పంటలు, పండ్ల తోటలు, ఆయిల్ పాం సాగులపై సందేహాల నివృత్తి. సాయంత్రం నెల్లూరు ఎమ్మెల్యే జకారెడ్డి అధ్యక్షతన బహుమతి ప్రదానోత్సవ సభ - జిల్లాలోని ఎమ్పీలు, ఎమ్మెల్యేలు ముఖ్య అతిథులుగా హాజరవుతారు. ఇవీ ఇప్పటి వరకు ఖరారైన కార్యక్రమాలు. పోయిన సారి వెరైటీ వ్యవసాయ వుత్పత్తులు, చికెన్ పకోడా స్టాల్స్ వంటివి ప్రత్యేక ఆకర్షణ లయ్యాయి. పట్టణంలో పలు చికెన్ పకోడా స్టాల్స్ ఏర్పడేందుకు స్ఫూర్తి నిచ్చాయి. ఈ సారి ప్రదర్శన నెల్లూరు ప్రజలకు ఏ కొత్త అంశాన్ని అందిస్తుందో చూచి వచ్చి చెబుతాము.



### తొట్రుపాటు గ్రంథావిష్కరణ సభ

వర్ధమాన సమాజ యాజమాన్యాన రిటైర్డ్ డిప్యూటీ తహసీల్ దార్ రాచగుండ్ల చెంచలరావు రచించిన తొట్రుపాటు పద్య కావ్య గ్రంథా విష్కరణ సభ 4 తేది టౌనుహాల్‌లో జరిగింది. సాహితీ విమర్శకులు అగస్త్యరెడ్డి వెంకురెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. రచయిత ప్రభుత్వ వుద్యోగిగా రిటైరైవిశ్రాంతి తీసుకుంటున్నా కవితా వ్యాసంగంలో అవిశ్రాంతంగా కృషి చేస్తున్నా రన్నారు. ప్రముఖ ఛార్టెడ్ అకౌంటెంట్ దుగ్గొట్టి రమణయ్య గ్రంధాన్ని ఆవిష్కరించారు. సంగీత, శిల్ప, జోతిష్య నాటకాల రహస్యాలను కవి సందర్భోచితంగా సమకూర్చినట్లు ప్రశంసించారు. కృతికర్త చెంచలరావు గ్రంథావిష్కరణోత్సవానికి కృతజ్ఞతలు వెల్లడిస్తూ కవికోకిల దువ్వూరి రామిరెడ్డి పతిత కౌశం పద్యకావ్య ప్రేరణతో తానీ కావ్యం వ్రాసినట్లు చెప్పారు. కృతిభర్త కొండూరు విశ్వజ్ఞాచారి కూడా మాట్లాడారు.

> **అతి తెలివి**
>
> ఆసుపత్రికి తీసుకపోయి
> ఆలును పరీక్ష చేయిస్తే
> ఆడపిల్లని తేలింది
> అదురు పుట్టింది వళ్ళంతా
> చంపనా బ్రతికించనా
> అనే సమస్య ఎదురైంది తండ్రికి
> ఆడపిల్లను తప్పక చేయాలి అంతం
> అంటూ బంధువులంతా చేరారు
> బలవంతం
> పుడితే అన్నం పెట్టలేకా
> పెళ్లికి వరకట్నం యివ్వలేకా
> పెనిమిటి గొంతెమ్మ కోర్కెలు తీర్చలేకా
> ఎందుకు కలిగింది చంపాలనే కోరిక
> అతి తెలివితో ఆలోచించకు
> అన్యాయంగా స్త్రీజాతిని ముంచకు
> ఆడపిల్లను చంపితే
> ఆగిపోతుంది ఇక ముందు జననం
> అసలు నిజంగా నీకు ధైర్యముంటే
> వరకట్నం అనే పిశాచాన్ని చేయి ఖననం
>
> - జె. కోదండ రామయ్య, కోవూరు.

వర్ధమాన సమాజం వైద్యుల శ్రీనివాసరావు కవి చెంచలరావును దుశ్శాలువాతో సన్మానించారు. సమాజం కార్యదర్శి బి.వి. నరసింహులు వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది.

### కవిత్రయ జయంత్యుత్సవాలు.

వర్ధమాన సమాజం, తిక్కవరపు రామిరెడ్డి కవిత్రయ జయంతి సంఘం ఆధ్వర్యాన కవిత్రయ జయంత్యుత్సవాలు ఈ నెల 12,13,14 తేదీల్లో టౌనుహాల్‌లో జరుగనున్నాయి. 12 తేది సభను డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి ప్రారంభిస్తారు. దుగ్గొట్టి వెంకట రమణయ్య అధ్యక్షతన మైసూర్ యూనివర్సిటీకి చెందిన డాక్టర్ ఆర్వీయస్ సుందరం ప్రసంగించి కవిత్రయ అవార్డు స్వీకరిస్తారు. 13 తేది న్యాయవాది మాడభూషి సుందరాచారి అధ్యక్షతన జరిగే సభలో బెంగుళూరు యూనివర్సిటీ ప్రొఫెసర్ టి.వి. సుబ్బారావు ప్రసంగించి అవార్డ్ అందు కొంటారు. చివరి రోజైన 14 తేది సభలో గూడూరు మహిళా డిగ్రీ కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ కె. మెహర్ మణి 'తిక్కన భారతం' అనే అంశంపై ప్రసంగిస్తారు. సాహితీ అభిమానులు కార్యక్రమాలకు తరలి రమ్మని వర్ధమాన సమాజాధ్యక్షులు పి.వి. రమణారెడ్డి సవినయంగా ఆహ్వానిస్తున్నారు.

### బాలుని నేత్రదానం

కంటి శిబిరాలను ఒక ఉద్యమంగా నిర్వహిస్తున్న నెల్లూరు నేత్ర దాతల సంస్థ మరో మైలు రాయి దాటింది. నేత్ర దాన ఆవశ్యకతను చాటి చెప్పి 13 సంవత్సరాల బాలుని కళ్లను తొలిసారిగా సేకరించడం జరిగింది. స్వతంత్ర పార్క్ వీధిలోని ఆంధ్రా బ్యాంక్ అధికారి వై.హెచ్. రామకృష్ణ కుమారుడు భార్గవరామ్ 5 తేది కండర క్షీణ వ్యాధి వల్ల మరణించాడు. సంస్థ సభ్యుల కోరిక మేరకు బాలుని తండ్రి నేత్ర దానానికి ఒప్పుకున్న వెంటనే సంస్థ వైద్యాధికారి డాక్టర్ జె. ప్రభాకరరెడ్డి, కోశాధికారి సి.హెచ్. ఆనందరామ్ సింగ్ సురక్షితంగా కళ్లను తొలగించారు. వీటిని 6 తేది మద్రాసులోని ప్రభుత్వ నేత్ర వైద్యశాల నేత్రనిధికి అందించినట్లు సంస్థ కార్యదర్శి తిక్కవరపు సుకుమార్ రెడ్డి తెలిపారు.

### బొందిలి సంఘ సమావేశం

ఆంధ్ర ప్రదేశ్ బొందిలి సంఘం జిల్లా శాఖ కార్యవర్గ సమావేశం 6 తేది ట్రంకు రోడ్డులోని శ్రీకృష్ణ భవన్‌లో జరిగింది. ముఖ్యమంత్రి కె. విజయ భాస్కరరెడ్డి వెనుకబడిన తరగతుల కమీషన్‌ను కె.ఎన్. పుట్టుస్వామి అధ్యక్షతన నియమించినందుకు హర్షం వెలిబుచ్చుతూ బొందిల కులాన్ని వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చమని తీర్మానం చేశారు. సభకు సంఘ అధ్యక్షులు ఆర్. భీమ్‌రాజ్ సింగ్ స్వాగతం చెప్పగా కార్యదర్శి ఎ. రాంసింగ్ చివరన వందనాలు తెలిపారు.

### త్యాగరాజ స్వామి ఆరాధనోత్సవాలు

శ్రీ త్యాగరాజ స్వామి వారి 147 వ ఆరాధనోత్సవాలను మూలపేట శ్రీ మహతి సంగీత విద్యాలయం 3 తేది వేద సంస్కృత కళాశాలలో ఘనంగా జరిపింది. వుదయాన త్యాగరాజస్వామి వారి చిత్ర పటాన్ని వూరేగించి పంచరత్న కీర్తనల గోష్టి పూజలు నిర్వహించారు. సాయంత్రం మహతి విద్యాలయం విద్యార్థుల సంగీత కచ్చేరీ అనంతరం జి.ఎన్. వరప్రసాద్ రావు వేణుగానం, కుమారి రాజ్యలక్ష్మి వీణా కచ్చేరి, ఎన్. రమణయ్య గాత్ర కచ్చేరి రసజ్ఞులను ఆహ్లాద పరిచాయి. ఎన్.వి. రమణయ్య శిష్య బృందం చేసిన భరత నాట్యం, ప్రత్యేక ఆకర్షణలుగా నిలిచాయి. చివరన జరిగిన బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమంలో మాజీ కౌన్సిలర్ వున్నం బసవయ్య, అన్నదేవుల గోపాల క్రిష్ణారెడ్డి, జి.కోటేశ్వరరావు పాల్గొన్నారు.

### శివారెడ్డి పద్యాలు

**కుమ్ములాట్లు**

రాజీనామా గోకి రమ్మంటె రాబోరు
కొట్లు తిట్లు ఒకటే కుమ్ములాట్లు
ఎంతమందిమంత్రులువీలారో, పొయ్యారో,
నాగరికులు వింటే నవ్వుతారు

**ఆరాధ్య దైవాలు**

ఆ దినాల్లో మునుపు ఆరాధ్య దైవాలు
కన్నతల్లితండ్రి, కలిమహత్తు
యీదినాల్లోయిప్పుడిల వేల్పు మగనాలు
తప్పుగాదు దీన్ని తరచరాదు

**బంగారు పంట - మాగుంట**

కంటి నిండా జూస్తే కనకాభిషేకాలు
పలకరిస్తే చాలు ఫలరసాలు
నీకు నీవె సాటి నీవె అన్నిటమేటి
కవికి తెలుసు టైము కలిసిరాల

మంచివారు మట్టు మర్యాదగలవారు
కల్తిలేని పచ్చి కాంగ్రెసోడు
దాన ధర్మముల్లో దర్జాలో మాగుంట,
ఆంధ్రలోనే లేదు అంతటోడు

### పంచాంగము

17 తేది గురువారం రథసప్తమి

**ఫిబ్రవరి తిథులు**

మాఘ శుద్ధ:

| | | |
|---|---|---|
| తే 12 శని | విదియ | రా.గ. 9.10 వ |
| తే 13 ఆది | తదియ | రా.గ. 10.45 వ |
| తే 14 సోమ | చతుర్థి | రా.గ. 12.36 వ |
| తే 15 మంగళ | పంచమి | రా.గ. 2.45 వ |
| తే 16 బుధ | షష్టి | రా.గ. 4.50 వ |
| తే 17 గురు | సప్తమి | పూర్తిగ |
| తే 18 శుక్ర | సప్తమి | ఉ.గ. 6.55 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

### నీటి మట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 16.8 అ |
| నెల్లూరు చెరువు | 16.5 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 10.05 అ |

### నెల్లూరు బజారు

మొలగొలుకులు

| | | |
|---|---|---|
| | 9672 క్రొత్తవి | 3,100/- |
| | 9672 పాతవి | 3,700/- |
| | 9674 పాతవి | 3,900/- |
| I.R. 20 | | 2,800/- |
| సన్నాలు | | 3,600/- |
| | 5656 | 2,900/- |
| మొలగొలుకు బియ్యం 70 కేజి | | 560/- |


జమీన్‌రైతు
సంవత్సర చందా రూ. 100/-
అర్థ సంవత్సర చందా రూ. 50/-

# శోభనానికి కోర్టు స్టే ఆర్డర్!

తమిళ సినిమాలలో కొన్ని సన్నివేశాలు విస్తారంగా ఉండటం మామూలే. ఒక తమిళ చిత్రం ఆధారంగా ఇటీవల నెల్లూరులో పులిమి వెంకటరెడ్డి గారింట్లో జరిగిన'' పుట్టినా మగాడిగా పుట్ట కూడదు'' చిత్రంలో నరేష్ తల్లి జయచిత్రది మొండి వైఖరి. స్త్రీ_ని స్త్రీ_యే మార్చగలదని ఉద్దేశ్యంతో ఆమనిని నరేష్ వివాహం చేసుకుంటాడు. తీరా శోభనం గదిలోకి ప్రవేశించ బోతుండగా ఆ శుభ కార్యం జరగ కూడదంటూ జయచిత్ర స్టే ఆర్డర్ తెచ్చింది. తమకు బాబు పుడితే వాడి చేత అత్త ముక్కుకు తాడు వేయిస్తానని ఆమని శపథం చేయగా అసలు శోభనమే జరగకుండా అడ్డు పడుతుంది అత్త. దానికి ఆమని అడ్డు వక్రం వేసి. శోభనం జరగొచ్చంటూ కోర్టు నుంచి ఆర్డరు తీసుకొస్తుంది. ఈ అత్త, కోడళ్ళ సవాళ్ళ మధ్య నలిగి పోకుండా బయటపడే హీరోగా నరేష్‌కు చాలా కాలం తర్వాత ఒక చక్కని పాత్ర లభించిందని డైరెక్టర్ టి. వి. రమణారెడ్డి తెలిపారు. నిర్మాతలు: ఎస్. మురళి శ్రీనివాస్,ఎన్.ఎస్ శ్రీనివాసరెడ్డి; సంగీతం: శశికుమార్.

## పేరు మార్పు

మామూలుగా చాలా చిత్రాల టైటిల్స్‌కు, వాటి కథలకు అట్టే పొంతన వుండదు. ఒక్కోసారి కొన్ని చిత్రాల పేర్లు హఠాత్తుగా మార్చబడు తుంటాయి. జగపతి బాబు హీరోగా నటించే '' మాంగల్యబలం'' చిత్రం పేరు '' అల్లరి పెళ్ళాం''గా మార్చబడింది. రెండో టైటిల్ ఆకర్షణీయంగా ఉండడమే గాక కథకు అనువుగా ఉందని దర్శకుడు క్రాంతి కుమార్ సంజాయిషీ.



లవ్‌గేమ్ వీడియో చిత్రంలో నెల్లూరు యువతులు రమ్యభారతి, లాస్య, మైథిలి

# ఓల్డ్ ఈజ్ గోల్డ్ అని నిరూపిస్తాం!

## జయప్రద ధీమా!

''జైలర్'' తమిళ చిత్రం సెట్‌లో జయప్రద చాలా నీరసంగా కనిపించింది. ఆ విషయమే ఆమెతో చెప్తే,'' ఈ చిత్రంలో నా పాత్ర అలాంటిది. పెళ్ళయిన కొద్ది రోజులకే నా భర్తను హత్య చేసిన విలన్ ను నేను హత మార్చి జైలుకు వస్తాను. ఇక్కడ నాకు బిడ్డ పుడుతుంది కూడా.

ఆ జైల్లోనే బందీలుగా ఉన్న విలన్ అనుచరులను కూడా తుద ముట్టించ డానికి సమయం కోసం ఎదురు చూస్తుంటాను. ఒక సారి మమ్ముట్టి జైలర్‌కు నామీద అనుమానం కలుగుతుంది. అప్పుడాయనతో ఏ మాత్రం దాచకుండా అన్ని విషయాలూ చెప్పేస్తాను. యావజ్జీవ కారాగార శిక్ష నుంచి నన్ను కాపాడ డానికి ఆయన ఎంతో శ్రమిస్తాడు. ఇదీ కథ. ఈ చిత్రంలో ఆయన సరసన నగ్మా నాయిక. ఈ చిత్రాన్ని తెలుగులో డబ్ చేస్తే బాగుంటుందని ఆలోచిస్తున్నారు'' అందామె. చాలా కాలం తర్వాత నేనూ, శోభన్‌బాబు, జయసుధ కలిసి 'జీవిత ఖైదీ' చిత్రంలో నటిస్తున్నాము. ముగ్గురివీ మూడు విభిన్నమైన పాత్రలు. ముగ్గురం పోటీ పడి నటిస్తున్నాం. ఓల్డ్ ఈస్ గోల్డ్- అని నిరూపించడానికి మాకు చక్కని అవకాశం. కథకుడైన డైరెక్టర్ పి. చంద్రశేఖర రెడ్డి కూడా అనుభవజ్ఞుడు గనుక చక్కని స్క్రిప్ట్ తయారైంది. పైగా ఇది 70 ఎం.ఎం. లో తయారవుతున్న చిత్రం కూడా . అంచేత ఈ చిత్రం సూపర్ హిట్ అయి తీరుతుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు.''అందామె.

## తెలుగు చిత్రంలో కుష్బూ

రెండు మూడేళ్ళపాటు తమిళనాడులో నెంబర్1 హీరోయిన్‌గా

కొరవ 11 పేజీలో

# బాబూమోహన్ హీరో అయితే నష్టమేమిటి?

## పద్మాలయలో గొడవ

హీరో కృష్ణ స్టూడియో పద్మాలయలో బాబూ మోహన్ హీరోగా నటించే '' సుందర వదనా సుబ్బలక్ష్మి మొగుడా'' చిత్రం షూటింగ్ సమయంలో జరిగిన గొడవ పలు వ్యాఖ్యానాలకు ప్రేరణ అయింది. జనవరి31 న ఆ స్టూడియోలోని పోలీస్ స్టేషన్ సెట్‌లో షూటింగ్ అద్దె పదిహేను వందల రూపాయలు ముందుగా చెల్లిస్తే గాని షూటింగ్ చేసుకోవడానికి వీల్లేదని స్టూడియో నిర్వాహకుడు జి.హనుమంతరావు నిక్కచ్చిగా చెప్పడం తమను ఎంతో అవమాన పరిచిందని డైరెక్టర్ రేలంగి నరసింహారావు చాలా బాధ పడుతూ చెప్పారు. '' అంతకు ముందు షూటింగ్‌లు జరిపినందుకు కొన్ని వేలు చెల్లించాం. ముష్టి పదిహేను వందల్ని ముందుగా చెల్లించాలని కృష్ణ సోదరుడైన హనుమంతరావు అంత దురుసుగా ప్రవర్తించడమేమిటి?'' అన్నారు రేలంగి నరసింహారావు. బాబూ మోహన్‌ను హీరోగా చేయడమేమిటి? అతను హీరో అయితే ఇక అసలు హీరోలకు విలువ ఏముందని భావించి హనుమంతరావు ఇలా ప్రవర్తించాడా అనే విషయం ఇద మిద్ధంగా తేల లేదు. ఈ విషయం తెలిసిన తర్వాతైనా కృష్ణ ఆ చిత్ర నిర్మాతలకు క్షమాపణ చెప్పి ఉంటే బాగుండేదని కొందరి అభిప్రాయం. ఇటుపైన పద్మాలయ స్టూడియోలో షూటింగ్‌లు జరుపు కోడానికి నిర్మాతలు ఒకటికి రెండు సార్లు ఆలోచించ వలసి వస్తోందని ఒక ప్రొడక్షన్ మేనేజర్ అన్నారు.

## నమోదు చేయబడిన కొత్త చిత్రాలపేర్లు

శ్రీ భాస్కర చిత్ర ''క్రయిమ్'' శ్రీలక్ష్మి ప్రభా ఇంటర్నేషనల్ '' దయ్యాల బావి'' వెంకట రమణా మూవీ కియేషన్స్ ''ఫైర్‌మాన్'' శ్రీ సురేష ప్రొడక్షన్స్'అనాథ' శ్రీ విజయలక్ష్మి కమర్షియల్స్ ''బొబ్బిలిరాయుడు'' వెంకటరమణ మూవీ క్రియేషన్స్ ''గోరమ్మా నీమొగుడెవరమ్మా'' నిలయా మూవీస్ ''జీసస్ క్రైస్ట్'' ఇంటర్నేషనల్ ఆర్ట్ ఫిలిమ్స్''కాలేజీ కుర్రోడు- విలేజీ అమ్మాయి'' భానుశ్రీ పిక్చర్స్ ''లాయర్ ప్రియాంక'' రాము ఎంటర్ ప్రైజెస్ ''లాకప్ డెత్'' భగీరథ ఆర్ట్ పిక్చర్స్ ''లవర్'' గీత చిత్ర ఇంటర్నేషనల్ ''1994 ఇండియా టుడే'' సాయి సురేష్ ప్రొడక్షన్స్ 'ఒక ఊరిలో ఒక రాజకుమారి' మధు ఫిలిమ్స్ డివిజన్ ''పోలీస్ కమాండో'' శ్రీ సూర్యా మూవీస్ ''ప్రేమికుడు'' శత్రు సంహారం''. విజేత ప్రవాలిక ఆర్ట్స్ '' విడాకులు'', వెంకట రమణ మూవీ క్రియేషన్స్ 'విజయం' హంసాలయా ఫిలిమ్స్'యువరక్తం' దీపిక ప్రొడక్షన్స్ '' గుండా జంక్షన్''

# వెరైటీ చిత్ర సమీక్ష

## కృష్ణ ప్రేమ

(1944 లో, 50 ఏళ్ల క్రితం విడుదలైన ఒక చిత్రం పై అనాటి జమీన్‌రైతులో ప్రచురితమైన ఒక చిత్రసమీక్షను ఇక్కడ ప్రచురిస్తున్నాము. అనాటి సినిమాకు, నేటికీ పోలిక చూసు కొనేందుకే ఇది; సినిమాల సంగతేమోకాని, సమీక్ష మాత్రం ఇప్పటి వాటి కంటే ఈ పాతదే బాగుందన్పిస్తోంది)

పదార్థం రుచి చెప్పడానికి పాక శాస్త్ర పాండిత్యం అవసరంలేదు, ఏ వాలుకైనా చెపుతుంది. అట్లే చిత్రాల గూర్చి గూడా- కొందరు చిత్రాన్ని కళాభిజ్ఞుల రుచినిబట్టి తెలగట్టాలంటారు: మరి కొందరు సామాన్య ప్రేక్షకుల కనుచూపులే కొలత బద్దంటారు.

''పెద్ద లిదమెచ్చి నను గారవించు దాక నా ప్రయోగంబు సరియని నమ్మజాల''నన్నారు కాళిదాస మహాకవి.

అనుభవ దర్శకుడు హెచ్.ఎం. రెడ్డి! నా చిత్రం సామాన్య జనామోదం పొందితే చాలునంటాడు. హాలీవుడ్ చిత్ర నిర్మాత విలియండీటర్లీ గూడ ప్రేక్షకుల అభిరుచిని కొల్త దీసుకొని ఆయాదికి సరిపొయ్యే చిత్ర నిర్మాణ కృషి సాగించాలంటాడు. తెలుగు భాగవత రచయిత అమరకవి పోతనేమంటాడో తెలుసా? ''కొందరికి తెనుగు గుణమగు

కొందరికిని సంస్కృతంబు గుణమగు - రెండుం గొందరికి గుణములగు- నే నందర మెప్పింతు''నంటాడు.

ఈ ఫక్కి నాకూ నీకూ గూడా నచ్చుతుందనుకుంటాను. కేవలం కళాదృష్టిలోవుంటే పండితులకు మాత్రమే నచ్చి చిత్రం ఆర్థికంగా దెబ్బతిని కూర్చుంటుంది. కేవలం పామర రంజకంగా వుంటే ధనానికి లోటు లేకపోయినా నోరు గల్గ పెద్దల ఆదరం పొందలేకుండా పోతుంది, కావున పండిత పామర జనరంజకంగా వుంటే ఉభయోరపి లాభకరంగా వుంటుందని నా వూహ.

ఇక కృష్ణప్రేమ ఏ తరగతికి చెందుతుంది?కథావస్తువు పౌరాణికమైనా ప్రేమ రహస్య తత్వార్థ నిరూపణగా ఇహ పరసాధనంగా వుంటుంది. సాంఘికంగా యింతకంటె హెచ్చు కాంక్షించదగిన వెలగల రత్నాలేమీలేవు ఇందులో- చిత్ర నిర్మాతలు ధనకాంక్ష ప్రధానోద్దేశంతో యీ కృషి సాగించారు గాన ప్రజా సామాన్య రుచికర ఘట్టాలనెన్నిటో యిరికి పెట్టారు. కథా సంవిధానంలో తగినంత బిగిలేదు గాన పాకం పాడిపాడిగానే వుండిపోయింది. అట్లని తీసివేయదగిన చిత్రం కాదు. తమ స్వాములకు నంచి మొదలుకు లోటు లేకపోవడమే గాక యింత సంపాదించి పెట్టుతుంది గూడా. హిందీ చిత్రాల అనుకరణ జాస్తిగా కనిపిస్తుంది.

నటీనటుల వ్యక్తిగణన.

**రాధ:**

శాంతకుమారి తన పాత్రను చక్కగా పోషించింది. గానరసము గూడా పలచగా తియ్యగా వుంది. ఇంత మాత్రం రుచిగా వుంటుందని నేననుకోలేదు. దర్శకునికి యిందులో హెచ్చు భాగం వుంది.

**రుక్మిణి:**

జయగౌరి, ముందుకు పోనూ లేదు వెనక్కు రానూలేదు.

**సత్య:**

ఈమె శృంగార రస స్వరూపిణి. ఒక్క నిమిషంలో గూడ పాపం! ఆనందాన్నిఅనుభవించ లేకుండా జేశారు చిత్ర సృష్టికర్త. ఈర్ష్య యొక్క భౌతిక స్వరూపమే ఈ సత్యగా నిర్మాణమైందా అనిపించింది.

**చంద్రావళి:**

రాధ చెల్లెలు, భానుమతి. దర్శకుడు ఈమెను కలహకంఠిగానే చివరివరకు నడిపాడు. అయితే పాటలో మాధుర్యము, వ్యక్తిలో చలాకీ ఎంతైనా ముందుకు నడిపాయి ఈమెను. ఈమెనింకా సానబడితే మంచితార గానం తనివి తీరలేదు.

**నారదుడు:**

తెనుగు సుబ్బులక్ష్మి సూర్యకుమారి. ఈమెకు శారీర సంపత్తేగాని, శరీర సంపత్తు మృగ్యం పాపం! పీల శరీరం. అందుకులోడు ప్రజారంజకమైన పాటల నివ్వలేదు.''గోకుల విహారి-మురారి గోవర్ధన ధారి'' అన్న గేయం ఒక్కటే నాకు బాగా నచ్చింది. ఆశించినంత ఆనందం పొందలేక పోయ్యాము. కాని శ్రావ్యమైన కంఠం-

**కృష్ణుడు:**

గాలి వెంకటేశ్వరరావు. అంటే ఉషా డైరెక్టరన్నమాట. వీరి వేష భాషాదులు అంత నచ్చినట్లు హృదయం వప్పుకోవడం లేదు.

**చందగోపుడు:**

రాధ చెల్లెలు చంద్రావళి భర్త. అర్థంకి దీనిలోకంటే కాళిదాసులోనే రాణించాడేమో?

ఇవి ముఖ్యపాత్రలు. ఇక డ్యాన్సు, గోపికల సంరంభం, మున్నగు ఆకర్షణీయ ఘట్టాలెన్నో ఉన్నవి. మొత్తానికి చూడదగియున్నది. డైరెక్టరు హెచ్.వి.బాబుగారి అధిక్యము బాగా కనిపిస్తుంది.

- ఇవే నమున్నులు.

## భారతి

(4 పేజీ కొరవ)

అస్పృశ్య బాలుడ్ని బ్రాహ్మణుడిగా చేసి జంధెం వేసారు. నాటి బ్రిటీష్ ప్రభుత్వం అతివాద రాజకీయ ప్రముఖుల పైన చర్య తీసుకోవడం ప్రారంభించింది. అరవింద ఘోష్, తిలక్ వంటి రాజకీయ ప్రముఖులు జైళ్ల పాలయ్యారు. నాటి పరిస్థితులలో భారతి అరెస్టు నుండి తప్పించుకొని పాండిచ్చేరి చేరారు. బ్రిటీష్ నిరంకుశత్వ పాలనకు వ్యతిరేకంగా పోరు సాగించారు. ఆయన రాజకీయ భావాలకు ఆకారమిచ్చిన వారు తిలక్.

1918 నవంబర్ 20 వ తేది భారతి ఫ్రెంచ్ బ్రిటీష్ సరిహద్దులలో అరెస్టు అయ్యారు. కడలూరు జైలులో 24 రోజులు బందీగా గడిపారు. ప్రముఖుల జోక్యం వల్ల విడుదలయ్యారు. మహాత్మాగాంధీని రాజాజీ ఇంట్లో కలిసారు. అహింసా సహాయ నిరాకరణ ఉద్యమం ఆయనను ఆకర్షించింది. ఆయన కలం నుండి జాతీయ గీతాలు తాత్త్విక గీతాలు వచన కవితలు, కావ్యాలు స్తోత్రాలు ఎన్నో వెలుగులోకి వచ్చాయి. సంఘంలోని వివిధ వర్గాల వారికి స్వాతంత్ర్యం రావాలన్నాడు. స్త్రీలను నీచంగా చూచే మౌఢ్యాన్ని దుయ్యబట్టాడు. అంధవిశ్వాసాలను నిరసించాడు. 1921 ఆగస్టులో మద్రాసు తిరువళిక్కేనిలో ఒక దేవాలయానికి వెళ్లాడు. అక్కడ ఆస్థాన గజరాజానికి ఒక కొబ్బరికాయ అందించాడు. ఆ గజరాజం రుతుమతి కావడం వల్ల తన తొండంతో భారతిని ఒక దెబ్బ కొట్టింది. దానితో స్పృహ కోల్పోయిన భారతి 1921 సెప్టెంబరు 12వ తేదీ పరమపదించాడు. చరిత్రను పరిశీలిస్తే మహాకవులు కొందరు జంతువుల కారణంగా బలైనట్లు కనిపిస్తుంది. సింహం వ్యాకరణ శాస్త్ర రచయిత పాణినిని, ఏనుగు మీమాంస శాస్త్ర రచయిత జైమినిని బలిగొన్నాయి.

### భారతి కవితలు

భారతి ప్రధానంగా గీత రచయిత. ఈ గీతాలు తమిళ దేశీయుల గృహాలలోను సభలన్నింటి లోనూ విశేష వ్యాప్తిని పొందాయి. ఆయన వేల సంఖ్యలో గీతాలు రచించారు. ఈ గీతాలలో సాంఘిక సంక్షేమం, స్వాతంత్ర్యం, దేశభక్తి, దైవభక్తి ప్రకృతి వర్ణన చోటు చేసుకొన్నాయి. జాతీయ భావాన్ని పెంపొందిస్తూ సామాన్య జనంలో దేశాభిమానం నాటు కోవడానికి ఈ గీతాలు ఎంతగానో ఉపకరించాయి. స్వాతంత్ర్యాన్ని గూర్చి చెబుతూ

ప. "విణ్ణిలి రవితనై విర్రు
పిళ్ళైవరుంబోయ్, మిన్మని కోల్
కణ్ణలు మినియ సుతంత్రం పోసివిన్,
కైకట్టి విళ్ళిప్పారో"

ఆకసంలో ప్రకాశించే రవిని వదలి ఎవరైనా మిణుగురు పురుగును కొల్తురే; కండ్ల ఎదుట స్వతంత్రత పోగా చేతులు కట్టుకొని జీవింతురే అన్నాడు.

స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం
పరయులకు, తీయలకు పులియలకు
స్వాతంత్ర్యం
పరవలకు, కురవలకు మరవలకు
స్వాతంత్ర్యం

నాటి వెనుకబడిన నిమ్నజాతుల వారికి కూడా స్వాతంత్ర్యం అవసరమని పై గీతంలో పేర్కొన్నాడు. ఆయన దేశభక్తి గీతాలకు ప్రధాన ప్రేరణ వందేమాతరం. వందేమాతరం ప్రాశస్త్యాన్ని తన కవితలో ఇలా చెప్పారు (అనువాదం)

"కారు చీకటి క్రమ్మివేసి మాతృదేశపు
జవసత్త్వాలను
మాటు గొల్పితే వందేమాతరం వచ్చింది.
ఆర్యాదేవి భారత మంత్రంవందేమాతరం"

మన వైవిధ్యాలను ఏకంచేసేది ప్రేమ బంధాలేనని దాని మూలంగా భారతీమతల్లికి అందరూ సన్నిహితు లేనని అంటారు. (అనువాదం)

30 కోట్ల జనాభా ఉన్న
ఆమెకు హృదయం ఒక్కటే
18 భాషలు
మాట్లాడుతుందామె కాని ఆమె మనసు
ఒక్కటే

"భారత జాతి" గేయంలో మనమంతా ఈ దేశపు రాజుల మన్నాడు. ఆకలిని పేదరికాన్ని తొలగించే స్వాతంత్ర్యం కావాలన్నాడు. "దేశస్తుతి" గేయంలో మన పూర్వుల చరిత్ర స్మరించాలంటాడు. "కాలభూమి " అనే గేయంలో తన నిరాడంబర జీవన విధానాన్ని ప్రదర్శించాడు. లోకంలో జీవ జాతులు ఒకే ప్రాణి కుటుంబానికి చెందినవి కాబట్టి జనులకు జీవ కారుణ్యం అవసరమన్నాడు.

భారతికి 18వ శతాబ్దిలో ఆళ్వారుల భక్తి తత్వంతో సన్నిహిత పరిచయం ఏర్పడింది. పెరియాళ్వార్ పాసురాలు భారతిని ప్రత్యేకంగా ఆకర్షించాయి. అందులో కృష్ణుని బాల్యం వర్ణించ బడి వుంటుంది. ఇది కణ్ణన్ పాట్టి గీతావళిగా భారతి వ్రాశారు. ఆయన ప్రకృతి కవితలో దిట్ట. ప్రతి వస్తువూ దైవ మన్నాడు. స్త్రీలు పురుషులకు భాగస్వామినులు గాని భాగస్వాములు కారు అన్నాడు. స్త్రీ అంటే మాతృత్వం భర్తృత్వం సంక్రమించిన మూర్తి అన్నాడు. "పాప్పప్పాట్టులో" బాల బాలికలలో నైతిక ఆధ్యాత్మిక బీజాలు నెలకొల్పాడు. "శత్రువును ప్రేమించు" అనే గీతలో శత్రు హృదయంలో కూడా దైవాంశం నిక్షిప్తమై యుంటుందన్నాడు. మహాత్మా గాంధీ పంచకంలో గాంధీ యుగానికి స్వాగతం పలికారు. ఇక "బందిపాట" "మారమ జాతి పాట" "చెరకు తోటల్లో" వంటి రచనలు భారతికి ఇతివృత్త నిర్వహణ సామర్థ్యాన్ని వ్యక్తం చేస్తాయి. ఆశయాలు అనే కవితలో "ఈ చెట్టు పెంచాము స్వామీ నీళ్లతో కాదు కన్నీళ్లతో" అనే గేయంలో భారతి యొక్క విశాల దృక్పథం స్పష్టమౌతుంది. "శబ్దం" అనే గీతలో మంచిని పెంచుకోవడానికి దివ్యశక్తుల్ని అర్థిస్తారు. తెలుగు సుందరమైన భాష అన్నారాయన. భారతదేశం అనే గేయంలో తెలుగు మాధుర్యాన్ని ప్రశంసించాడు.

వీరి [illegible] "కుయిల్ పాట్టు" అనే 75 పాదాలు కల్గిన కావ్యం. ఇందులో పశుపక్ష్యాదులే పాత్రలు. కోయిల నాయిక. అడుగడుగున హాస్యం, భావుకత నిండి వున్న కావ్యమిది. దీని తరువాత పాంచాలి శపథం అనే కావ్యం ప్రసిద్ధి పొందింది. దీనికి ద్రౌపది విజయం అని పేరు. ఇది 5 అధ్యాయాల కావ్యం. స్త్రీని శక్తి స్వరూపిణిగా అధికార దర్పం పూరితులైన రాజులకు గుణపాఠం నేర్పగల వ్యక్తిగా ప్రదర్శిస్తూ ఆయన ఈ కావ్యం వ్రాసాడు. విమర్శ గ్రంథాలలో భగవద్గీత జ్ఞానకర్మ భక్తి యోగాల సముచ్చయ బోధకమగు మోక్ష శాస్త్రమని భారతి నిరూపించారు.

"జ్ఞాన రథం" అనే వచన కావ్యంలో ఈశ్వరుడు జ్ఞాన విమానాన్ని అందరికీ ప్రసాదించాడని దానిని సరిగా ఉపయోగించుకొంటే ఎంత ఉన్నత స్థితికైనా పోవచ్చునన్నాడు. "చంద్రికై యిన్ కవితై" అనేది ఒక అసంపూర్ణ సాంఘిక నవల. సంఘ సంస్కరణోద్దేశంతో వ్రాసిన నవల ఇది. కథానికలలో స్వర్ణకుమారి అనేది హిందువులను మూఢాచారాల నుండి విముక్తి చేసే బ్రహ్మసమాజం చేపట్టిన సంస్కరణ. "ఆరోవంతు" అనే కథ వర్ణ సమానత్వాన్ని ప్రబోధిస్తూ జాతి పునరుజ్జీవనానికి బ్రహ్మచర్యమే కీలకమైన సాధనమని చెబుతున్నది. "అయిదు బురుజుల కోట" అనే కథ అస్పృశ్యతా నిర్మూలన వస్తువుగా గలది. సంస్కృత పంచతంత్ర కథలలోని చిన్న చిన్న కథలలో వుండే నీతులను సూచిస్తూ "నవతంతి రక్కదైగళ్" అనే గ్రంథం వ్రాశాడు. రవీంద్రుని గీతాంజలి, క్రిసెంట్‌మూన్, భారతిని ప్రభావితం చేసాయి. వీటిని ఆయన అనువదించారు.

జనపదాలలో వాడుకలో ఉన్న పదాలను సాహిత్యానికి సమన్వయించాడు. తమిళ సాహితీ జీవన స్రవంతిలో జాతీయ కవితకు ఆరని హారతి పట్టిన సుబ్రహ్మణ్య భారతి కవితా స్రవంతి ఒక ఆశను, ఆత్మవిశ్వాసాన్ని వారసత్వంగా నెలకొల్పి, భావితరానికి ఆశారేఖలను తీర్చి తమిళ సాహిత్య సరస్వతికి కొత్త అంద చందాలను సమకూర్చిన దనడంలో ఎట్టి అతిశయోక్తి లేదు. ఆయన జాతీయ కవితకు కేవలం తమిళనాడే కాక యావద్భారతం కూడా ఋణపడి వుంది.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ కొరవ

ఇక ఎలక్షన్ జరుగ బోతున్నది-
"అయమ్మార్గస్సుమూర్తవః
- మరీ పాత విద్యార్థి

### నెల్లూరు జిల్లా జమీన్రైతు సంఘము

వెంకటగిరి ఎస్టేటులో ఫారెస్టు ఆక్టు ప్రవేశానికి ప్రతి వూరినుండి ఆక్షేపణ తెలుపుతూ మహజర్లు పంపాలి- ఇనాం గ్రామాల చట్ట సవరణకు ఆందోళన చెయ్యాలి- చెల్లాయపాళెం శోత్రియందారు, అనాది హక్కు అనుభవ భుక్తములు గల రైతులను వెళ్లగొట్ట నోటీసులు యిచ్చుటను గూర్చి నిరసన ఇంకా --

6-2-44 తేది సాయంత్రము 4 గంటలకు పై కార్యవర్గ సమావేశము శ్రీ బద్దిపూడి పేరారెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. కార్యవర్గ సభ్యులేకాక తాలూకాలోని ముఖ్య రైతు నాయకులు రైతులు విచ్చేసిరి. కమిటీ సమావేశములో కార్యదర్శి మహానంద చౌదరి యిప్పటివరకు జిల్లాసంఘము చేసిన కృషిని సమీక్షిస్తూ ప్రతి గ్రామంలోని రైతులు సంఘంలో సభ్యులుగా చేరి సంఘానికి బలము చేకూర్చి తద్వారా తమ యిబ్బందులు పోగొట్టుకో వలసిన దనియూ, రైతునాయకుల మంచూ బురఖాలు తగిలించుకొని రైతాంగానికి ద్రోహము తల పెట్టే ద్రోహుల పారదోలి జిల్లా సంఘము యిచ్చిన కార్యక్రమాన్ని కొనసాగించాలని కోరిరి.

### నెల్లూరు ముచ్చట్లు

#### ఫస్టుగ్రేడ్ కాలేజి

గవర్నరుగారి ఆగమన సందర్భ సుముహూర్తాన ఫస్టు గ్రేడు కాలేజి ప్రకటన శ్రీరాజా సాహెబులవారి వల్ల జరగ వచ్చును అని విన్న వదంతి అక్షరాల అబద్ధమైంది.

ఇక రాజాగారి పక్షాన వేదాంతాచారి గారే స్వయంగా రాజాగారి స్వంత చేవ్రాలు అప్లికేషన్‌తో ఆంధ్ర యూనివర్సిటీ గుమ్మం వద్దకు పోతారు అనే రెండవ కిం వదంతి మాత్రం నిల్వలోవుంది-

" అర్థం ప్రాణం ఆచార్యాధీన" మన్నమాట.

### బృందావనం "రేప్" కేసు

గోపగోపికలకు ఇంత ఆశ్రయ మిచ్చేది బృందావనం. ఆ బృందావన వాసి పొంగూరు రామమ్మ అనే బ్రాహ్మణ ఆడ పునీత స్త్రీని చెరచినారని నీలి సిద్ధయ్య, మాటమడుగు మస్తాన్, సుబ్రహ్మణ్యం అను ముగ్గురమీద కేసు మోపారు పోలీసు వారు. సుబ్రహ్మణ్యం పరారీ. ఈ కేసు అసిస్టెంటు సెషన్సు కోర్టులో యీ నెల 2 నుండి 7 వరకు విచారణ జరిగింది. కోర్టు ప్రేక్షకులచే నిండి నిబిడీ కృతమై పోయింది. ముద్దాయిలు రాత్రి ఒంటి గంటప్పుడు రామమ్మ నివసించే యింటికి వెళ్ళి ఆమెను చెఱచినారనేది కేసు- తురకా వెంకటసుబ్బమ్మ, రేవూరు సుబ్బమ్మ, అన్నం వెంకట సుబ్బమ్మ, భైరవరపు రుక్మిణమ్మ మొదలగువారు సాక్షులు.

విచారణలో రామమ్మ తన భర్తతో విడాకులు పుచ్చుకోవడం, అప్పారావుతో ఫోటో తీయించు కోవడం, ఆమెగారి అనంత కోటి చరిత్రలు మొదలుగా గల రసవత్తర ఘట్టాలన్నీ కోర్టులో నడిచినవి. విచారణ పూర్తి అయింది. జడ్జిమెంటు 16 తేదికి వాయిదా-

### సినిమా

" మనసుచేత, వాక్కుచేత,
కర్మంబుచేత
లీలకైవల్య మందజాలినది ప్రేమ" -

అని చెప్పే అమర సందేశం హెచ్.వి.బాబు దర్శకత్వంతో తయారైన 'కృష్ణప్రేమ' 15 తేది వినాయక హాలులో గొప్ప విడుదల-

- మొదటి 3 వారాలు కాంప్లిమెంటరీలు, అర్ధచార్జీలు, కన్సెషన్సు చెల్లబడవు.

సోమవారం [illegible]




## నెల్లూరీయుల ఆస్తులు (4 పేజీ కొరవ)

ఆర్కాటు జిల్లాలని తెట తెల్ల మవుతుంది. తెలుగు వారైన ధనికులు చెన్నపురి చుట్టు 'రక్షణ గృహాల'ను నిర్మించగా (Defensive Battery Houses) వీటిలో వుండిన పనివారు చాలా మంది తమిళులు. అయితే నెల్లూరీయు లెవరు? వారి శాతమెంత? అనే విషయాలు తెల్సుకొనుట వీలుకాదు.

విజయనగర పాలనా కాలంలో అనేక పదవులలో నియమితులైన నెల్లూరీయులు. ముఖ్యంగా రాయల సీమ కర్ణాటక ప్రాంతాలలోని వారిలో కొందరు చెన్నపురి వెలసిన తర్వాత ఆ నగరానికి చేరారు. నవాబుల కొలువులలో వివిధ శాఖల్లో నౌకరీలు చేసిన నెల్లూరీయులలో చాలా మంది కూడా ఇట్లే చెన్నపురికి చేరారు. ఈ విధంగా అనేక ప్రదేశాలలో కొద్ది కాలం పాటు గడిపిన నెల్లూరీయులు తమిళం. కన్నడం, ఉర్దు, పార్శీ భాషలను కొంత వరకు నేర్చుకొన్నారు. ఆ రోజుల్లో కోస్తా వాసులైన నెల్లూరు పండితులు ఆంగ్లాన్ని అతి వేగం- అభ్యసించి సహజ దుబాసీలుగా పేరు గాంచారు. దానివల్ల ఆంగ్లేయ, ఫ్రెంచి, కంపెనీలలో దుభాషిత్వాలు నిర్వహించిన తెలుగు వారెక్కువగా బ్రాహ్మణులు, నాయుళ్లు, యాదవులు. వ్యాపారాలు నిర్వహించు కొంటుండిన వైశ్యులు, రెడ్లు ఎక్కువగా దుబాషిత్వాన్ని స్వీకరించలేదు.

చెన్నపురి స్థాపన తర్వాత 1760 వ సం. వరకు దాని ఆస్థి పాస్తులను అభివృద్ధి రీతులను పరిశీలిస్తే ఈ నగర వాసులు ఆంగ్లేయుల దృష్టిలో కేవలం తెలుగు వారుగా మాత్రమే కనిపిస్తున్నారు. పెద్ద పెద్ద బంగళాలు, తోటలు, కాలువలు, భూములు వీటికి వున్న పేర్లు తెలుగు వారివే. ఇప్పటి చంత తోపుకు (పులియంతోపు) ఉత్తరంగా ప్రవహించి, బేసిన్ బ్రిజి దాటి ఆగ్నేయంగా తిరిగి, ఏనుగుల ద్వారం నుండి దక్షిణంగా ప్రవహించి పెద్ద నాయకుని పేటకు తూర్పు సరిహద్దుగా నున్న కూపం నదిలో కలుస్తుండిన ఉత్తరపు పేరు ( ఎలంబేరు. తర్వాత కొక్రేన్ కాలువ. తర్వాత బకింగ్ హామ్ కాలువ) చుట్టు ప్రక్కల తెలుగు శ్రీమంతుల బంగళాలు వ్యాపించి వుండేవి. వాటిలో కొన్నిటిలో ఐరోపియనులు అద్దెయిచ్చి నివసిస్తుండేవారు. ఈ నదిలో ఒక పాయ (కాలువ? ) కరుకుల పేట నుంచి ఇప్పటి బ్రహ్వార్వీధి (పెద్దబజారు) (Broad Way) ద్వారా నేరుగా వెళ్ళి ప్రస్తుతపు హైకోర్టు పడమర వైపులో వ్యవసాయ కాలువగా ఉపయోగ పడి చివర మళ్ళీ ఎలంబేరులో కలిసేది. ( తర్వాత ఈ కాల్వను పూడడం వల్లనే బ్రహ్వార్వీధి ఏర్పడింది) ఈ చుట్టు పక్కల భూకామందు లందరూ దాదాపు తెలుగు వారే. ఇప్పటి మద్రాసు వైద్య కళాశాల, జనరల్ ఆసుపత్రి ప్రాంత మంతా చెట్ల పొదలతో నిండి నక్కల అడవి ( నారిమేడు) గా వ్యవహరింప బడేది. స్థానికులు నివశించే పేటల పేర్లు, వాటిలోని వీధుల పేర్లు, వ్యక్తులు, కులాలు, వృత్తులు, సహజ చిహ్నాలు మొదలగు వాటిని తెలియ జేస్తుండేవి. కరకుల ( స్వర్ణ నాణెములు) ను ముద్రించే స్థలం కరుకుల పేటైంది. ముత్యాలనమ్మే స్థలం ముత్యాల పేటైంది. పగడాలనమ్మే స్థలము పగడాల పేటగా పిలవ బడింది. పెద్ద నాయకుని పేట, చిన్న నాయకుని పేట, పెద్ద అంబూరు (పెరుంబూరు). చిన్న అంబూరు, చాకలి పేట, పెద్ద మిట్ట, చిన్నమిట్ట అనేవి కొన్ని యితర నామాలు. స్థానికులు నివశించే నల్ల బస్తీలోని అప్పటి వీధుల పేర్లు: శెట్ల వీధి, కోమట్ల వీధి, బ్రాహ్మణ వీధి, చాకలి వీధి, నది ప్రక్క వీధి, పెద్ద బజారు, చిన్న బజారు, మూరుల వీధి, తోటల పట్టు వీధి, బండ్ల మెట్టు వీధి మొదలగునవి.

మొట్ట మొదట చెన్న పురిలో క్రీ.శ 1720 వ సం.లో పాఠశాలల స్థాపన జరిగినపుడు మొదట తెలుగును, తరుపరి తమిళాన్ని రెండు స్థానీయ భాషలుగా ప్రవేశ పెట్టారు.

నెల్లూరు సీమతో పాటుగా కర్ణాటక ప్రాంత మంతటినీ నవాబు చేసిన అప్పుల లోనికి గాను 1790 వ సం.లో ఆంగ్లేయ తూర్పిండియా కంపెనీ వారి వశం చేశారు. వెంటనే కంపెనీ వారు డైటన్ ను నెల్లూరుకు ముఖ్య కలెక్టర్ గానూ ఎరస్కిన్ ను ఒంగోలుకు సబ్ కలెక్టర్ గాను ప్రధానంగా శిస్తు వసూళ్ళకై నియమించారు. అయితే కొన్ని కారణాల వల్ల 1792 సం.లో నెల్లూరు సీమను తిరిగి నవాబుకు ఇచ్చారు. తిరిగి 1801 లో కర్ణాటకను నవాబు శాశ్వతంగా ఆంగ్లేయ కంపెనీ కిచ్చాడు. కర్ణాటక నవాబు నామ మాత్రంగా 1857 వ సం. వరకు కొనసాగి వున్నా. అతడు పాలకుడు మాత్రం కాదు; కేవలము పెన్షన్ కు మాత్రమే హక్కు దారుడై వుండినాడు. ఈ విధమైన బదలాయింపులలో తమ తమ సౌకర్యార్థమై నెల్లూరీయులు కంపెనీ వారి వైపు మొగ్గు చూపారు.

క్రీ.శ. 1790-1880 మధ్య కాలంలో నెల్లూరీయులు- ముఖ్యంగా వ్యాపారులు, అధికారులు- అ... సంఖ్యలో చెన్నపురికి చేరారు. 1833-34 కరువులోను, తిరిగి 1876-77 ధాతు కరువు సమయం లోనూ చెన్నపురి సమీప నెల్లూరు పల్లెల నుంచి బీదవారనేకులు చెన్నపురికి చేరారు. ధాన్యం, బట్టలు, కట్టెలు మొదలగు వానిని సరఫరా చేసే వారకులు కూలీ సమయాల తర్వాత చెన్నపురికి చేరారు. కరువు కాటకాలలో చిక్కుకొన్న బీదలకు ఆంగ్లేయులు ప్రభుత్వ, ప్రయివేటు సహాయాన్ని క్రైస్తవ మిషనరీల ద్వారా అందించారు. క్రైస్తవులుగా మతాంతీకరణ చెందిన నెల్లూరీయులు కొందరు బ్రిటీష్ మత బోధకుల వద్దకు, చెన్నపురికి చేరారు. భటులుగాను, సేవకులుగాను చెన్నపురికి చేరిన నెల్లూరీయులు కూడా అధిక సంఖ్యలోనే వున్నారు.

నెల్లూరు జిల్లాకు చెందిన చాలా మంది పనివారు 1877-1892 సం.ల మధ్యలో సాగిన బకింగ్ హామ్ కాలువ పనులలో నియమితు లయ్యారు. వీరిలో కొందరు చెన్నపురికి తరలి వెళ్ళినట్లు తెలుస్తూంది. ఎఎస్ఠాన్సెల్ క్రోడీకరించి 1964 లో ప్రకటించిన బకింగ్ హామ్ కాలువ చరిత్రను బట్టి చూస్తే, నిజామ్ పట్నం వద్ద మొదలై చెన్నపురిలోని కూపం నది వరకుండిన నిడివి పొడుగునా నెల్లూరు పనివారే కన్పిస్తారు. చెన్నపురి నుంచి 168 వ మైలులోని పాలేరు, 123 వ మైలు లోని పైడేరు, 75 వ మైలు లోని స్వర్ణముఖి, 19 వ మైలు లోని పులికాటు సరస్సు, నడుమ తెరపిలలో నడిచిన కాలువ పనులలో నియమింప బడినవారు చాలా వరకు నెల్లూరీయులే. వీరిలో బాగా కష్టపడే తెలివైన గ్రామికులను వారి యజమానులు చెన్నపురికి పిలిపించు కున్నారు. ఆ విధంగానే చెన్నపురిలో అడయారు వరకు నడిచిన పనులలో కూడా నెల్లూరు పని వారుండారు.

ఇంకా వుంది.



## జనవాణి

(3 పేజీ కొరవ)

ఎక్కువ సమయం తీసుకొంటూ ప్రయాణీకులకు తీవ్ర అసౌకర్యం కల్గిస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలకు వస్తున్న బస్సులు సరైన సమయానికి రావు. వాటి వేగం కూడా అంతంత మాత్రమే. బస్సులు క్రిక్కిరిసిన సమయాల్లో చెకింగ్లు ఎక్కి వాటిని ఆపేస్తారు. ఉదయం పూట ఆఫీసులకు, కాలేజిలకు, హాస్పిటల్ ఇతరత్రా పనులకు అర్జంట్‌గా వెళ్ళే వాళ్లు అధికం. బస్సులను 15-20 నిమిషాలు ఆపేసి ప్రయాణీకుల సహనాన్ని పరిశీలించే బదులు బస్సులు నడుస్తున్న సమయంలోనే చెకింగ్ చేసే విషయం వున్నతాధికార్లు పరిశీలించాలి.

సంగం - పోట్ల శ్రీహరి.

### బాలాజీ నగర్‌లో స్పీడు బ్రేకర్లు ఏర్పాటు చేయండి.

బాలాజీ నగర్‌లో నిత్యం జనం గుమికూడి వుండే సెంటర్లు, ఎద్దుల రేవు సంగం బ్రిడ్జి, పాలబూతు సెంటర్, మున్సిపల్ రీడింగ్ రూం సెంటర్లు టౌన్ బస్సులతోపాటు మోడరన్ స్కూలు, సర్కార్ పేపర్ మిల్, నెల్లూరు సెంట్రల్ స్కూలు, బాలాజీ స్టీల్స్ వెళ్లే బస్సులూ ఈ సెంటర్లలోనే ఆగుతుంటాయి. కార్లు, స్కూటర్లు, లారీల సంగతి చెప్పక్కరలేదు. స్కూలుకు వెళ్లే పిల్లలతో ఈ ప్రాంత మంతా కళ కళలాడు తుంటుంది. పోయే వాహనాలు అడ్డు అపు లేని వేగంతో పొగుతుండడం వల్ల ఇటీవల ప్రమాదాలు ఎక్కువయ్యాయి. చిన్న పిల్లల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని ఈ మూడు ప్రాంతాలలో స్పీడ్ బ్రేకర్లు ఏర్పాటు చేయాలని మనవి.

నెల్లూరు - ఎస్.సత్య స్వరూప్.

### ఎ.సి.నగర్ కరెంటు

ఎ.సి.నగర్, ఉస్మాన్ సాహెబ్ పేట ప్రాంతాల్లో గత 15 రోజాలుగా రోజూ సాయంకాలం 6 గంటల నుండి గంటకు పైగా విద్యుత్ సరఫరా వుండడం లేదు. ఫిబ్రవరి 4, 6 తేదీల్లో రాత్రి 10 గంటల వరకూ విద్యుత్ లేదు. ప్రభుత్వం అధికారిక కోత వుత్తర్వు జారీ చేయక పోయినా ఈ అనధికార కోత ఏమిటో అర్థం కావడం లేదు.

నెల్లూరు - ఎం. ప్రభాకరరావు.

## సినిమా

(9 పేజీ కొరవ)

రజనీకాంత్ కమలహాసన్ వంటి అగ్రశ్రేణి హీరోల సరసన నటించిన ఖుష్బూకు పాపం ఏ దుర్దశ వచ్చిందో ఏమోగాని, ఇప్పుడామెకు ఒక్క తమిళ చిత్రమైనా లేదు. ప్రభుతో కె. బాలచందర్ రూపొందించే "డ్యుయెట్" చిత్రంలో ఆమె తొలగించబడి, మీనాక్షి శేషాద్రి బుక్ అయ్యింది. ఇటీవల ఒక తమిళ చిత్రంలో ఒకే ఒక నృత్య సన్నివేశంలో పాల్గొన్నందుకు ఎంతో వ్యధ చెందిన ఖుష్బూ "పేకాట పాపారావు" చిత్రంలో రాజేంద్రప్రసాద్ సరసన బుక్ అయ్యింది. ఈ చిత్రంలో కోట శ్రీనివాసరావు, బ్రహ్మానందం, తనికెళ్ళ భరణి, శ్రీలక్ష్మి, ఆలి, చిడతల అప్పారావు, చంద్రిక ఇతర పాత్రధారులు. దర్శకత్వం: వై. నాగేశ్వరరావు.

# స్వర్ణోత్సవం

## మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్ ఏజెన్సీస్

**No. 4,** సెకండ్ లైన్ బీచ్ - మద్రాసు - **600 001.**

## 1944 - 1994

1.3.1994 తేది శుంగళవారం. మద్రాసు మహాలింగపురం ఎమెలెమ్ (EMELEM) కళ్యాణ మండపంలో జరుగుతుంది. ఈ సంతోష సమయంలో మా శ్రేయోభిలాషులు, స్నేహితులు, మా కంపెనీ పురోభివృద్ధికి ఇంతకాలం సహకారాన్నందించిన ఖాతాదారులందరికీ కృతజ్ఞతలు తెలుపుకొంటూ స్వర్ణోత్సవంలో పాల్గొనవలసిందిగా కోరుచున్నాము.

నాటి మెసర్స్ అల్లైడ్ ఇండస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్స్ నుండి.....

ఇ.ఎస్.రెడ్డి, జనరల్ మేనేజర్

| | | | | |
|---|---|---|---|---|
| గజలక్ష్మి డైస్ అండ్ కెమికల్స్ (బెంగళూరు)<br>స్థాపితము: 26.7.74 | గజలక్ష్మి డైస్ & కెమికల్స్ మద్రాసు<br>స్థాపితము: 9.9.72 | శ్రీ శ్రీనివాస కలర్స్ మద్రాసు<br>స్థాపితము: 28.8.89 | శ్రీరామా డైస్&కెమ్ మద్రాసు<br>స్థాపితము: 28.8.89 | కామాక్షి కలర్ కంపెని మద్రాసు<br>స్థాపితము: 24.4.76 |
| ఇ.ఏ. పద్మనాభ రెడ్డి<br>జనరల్ మేనేజర్ | యస్. ప్రభాకర రెడ్డి<br>మేనేజర్ | యస్. ప్రభాకర రెడ్డి<br>మేనేజర్ | కె. గోపాలకృష్ణారెడ్డి<br>మేనేజర్ | ఇ.జే. కృష్ణారెడ్డి<br>మేనేజరు |
| విజయలక్ష్మి కెమికల్స్ (గజలక్ష్మి కెమికల్స్‌లో విలీనము చేయబడినది) | 31.3.91 లో శ్రీనివాస డైస్ అండ్ కలర్స్‌లో విలీనం చేయబడినది. | శ్రీ పద్మాకెమ్ డైస్<br>స్థాపితము : 23.8.83<br>యమ్. చంద్రశేఖర రెడ్డి<br>మేనేజరు | 31.3.91 లో కామాక్షి కలర్ కంపెనీలో విలీనము చేయబడినది. | |

- - - ఈనాటి మద్రాస్ ఇండస్ట్రియల్ కెమికల్ ఏజెన్సీస్ వరకు

భవదీయులు

ఏనుగ సీతారామ రెడ్డి - ఏనుగ జనార్దన కృష్ణారెడ్డి

ఏనుగ అనంత పద్మనాభరెడ్డి - తిక్కవరపు సీతారత్నమ్మ

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Navagara Paper Products (India) Ltd.,